













Co-optex
FABRICS
H. 1.

## ఆరోగ్యానికీ, రుచికరానికీ



## పూజలకు, వివాహాలకు




## గడియారం మార్కు

# కర్పూరము

### ఉపయోగించండి

గోపాల్జీ ఛాంపక్ & కో.
[illegible] మద్రాస

---

## జేబు ప్రెస్ (అచ్చు యంత్రం)



ఇందు హిందీ, ఇంగ్లీషు భాషల అక్షరాలేగాక సిరా ముహర్లు తయారుచేసే పద్ధతులు, పేడులు ఉన్నాయి. ఏ పేరు అచ్చు వెయ్యాలన్నా ఐదు నిమిషాల్లో తయారై పోతుంది.

వెల రు. 6-0-0
పోస్టేజి 1-4-0 అధనం.

### ఎలెక్ట్రిక్ గైడు

ఈపుస్తక సహాయంతో ఎలెక్ట్రిసిటీ లేని రేడియో 15 రూపాయల్లో తయారు చేసుకోవచ్చు. ఎలెక్ట్రిసిటీ సంబంధించిన పనులన్నీ నేర్చుకొని నిపుణులైన ఇంజనీయర్లు కావచ్చును. వెల రు. 2-8-0. పోస్టేజి 0-12-0 అధనం. ఉత్తరప్రత్యుత్తరాలు ఇంగ్లీషులో జరుపండి.

**Address : SANSAR TRADING CO.**
(C.M.M.) P. O. 21, ALIGARH (U.P.)

---

## ముఖ్యమనవి

**ఆనంద సుధ** సమస్త జనులకు కండపుష్టిని, బలమును, చక్కని ఆరోగ్యమును కలిగించును.

8 ఔ॥ సీసా రు. 3-0-0

**స్త్రీ సుధ** స్త్రీలకు చక్కని ఆరోగ్యమును, సంతోషమును, సత్సంతానమును కలిగించును.

1 తులము రు. 4-0-0

**బాల సుధ** పసిపిల్లలయొక్క సమస్త వ్యాధులను నశింపజేయును.

50 మాత్రల సీసా రు. 1-0-0

ప్రతిషాపులోను దొరుకును.

---

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి & సన్సు,
రాజమండ్రి.




ఆంధ్ర ఉ సీడెడ్ : నవయుగ ఫిలిమ్సు, విజయవాడ

మైసూరు : ప్రకాష్ పిక్చర్సు, బెంగుళూరు సిటీ :: నైజాం : కర్నాటక ఫిలిమ్సు లి., బెంగుళూరు సిటీ

ఇతర వివరాలకు : ప్రకాష్ ప్రొడక్షన్సు :: శాంథోమ్ :: మద్రాసు - 4

# ఉమా బటన్స్

బంగారు రేకు లోహముపైన అంటించి తయారు చేయబడినవి. జీవితకాలం వరకు తృప్తి ఇస్తుంది.




Collar Pin As. 12/-




వస్తువులకు వి. పి. పార్శిలు చార్జి 1-2-0 మాత్రం. కావలసినవారికి క్యాటలాగు ఉచితముగా పంపబడును.

**ఉమా గోల్డు కవరింగు వర్క్సు**

ఉమామహల్ :: మచిలీపట్నము



# డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టియిచ్చును. పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co., BOMBAY-4



ఇప్పుడు దొరుకుచున్నది అమెరికన్ మోడల్ రోల్ ఫిలిమ్ బాక్సు కెమెరా

గొప్ప పవర్ లెన్సులతోను వ్యూఫైన్డర్‌తోనూ అమర్చబడిన అత్యుత్తమమైన ఈ కెమెరా చాల చౌక. ప్రారంభకులుకూడ చక్కగ ఉపయోగించవచ్చు. నం. 120 రు ఫిలిమ్ పైన $2\frac{1}{4}'' \times 3\frac{1}{4}''$ సైజులో అద్భుతముగా ఫోటోలు ఎత్తును. ఫోటోలు తీయు విధానంతో సహా వెల రు. 10-8-0. ప్యాకింగ్, పోస్టేజీలకు రు. 1-8-0 అధనం. కెమెరాకు సరిపడు లెదర్ కేస్, రు. 3-0-0. సరుకు కొద్దిగ ఉన్నది. నేడే ఆర్డరివ్వండి. ఉత్తర ప్రత్యుత్తరములు ఇంగ్లీషులోనే జరుపండి.

**BENGAL CAMERA HOUSE (108 C. H.)**

P.O. 21, ALIGARH, U.P.

ఆంధ్ర, సీడెడ్, నైజాంలలో
విజయవంతముగ
ప్రదర్శింపబడుచున్నది

వినోదా వారి...

# స్త్రీ సాహసము

...దర్శకత్వం...
వేదాంతం రాఘవయ్య

రచన-పర్యవేక్షణ...సముద్రాల... సంగీతం... సుబ్బరామన్
ఛాయ...బి. యస్. రంగా... కళ...వాలి & గొడగాంకర్

పూర్ణా రిలీజ్

MATA



CH. E. PRASAD

ఆంధ్ర, సీడెడ్, నైజాం : పూర్ణా రిలీజు : మైసూరు : అమృత పిక్చర్సు

# సావరిన్ సూక్తులు




రైలు బళ్లలో తెగ నమలొచ్చు.

ట్రాముల్లో మరి తినొచ్చు నీ యిష్టం.

బస్సులలో ఇక బలే బాగు.

ఒకటననేల అన్ని వేళల. అన్నిచోట్ల.

కాని. వినవోయి! ఒక మాట

## బడిలో మాత్రం తినొద్దు నీవు




# సావరిన్ స్వీట్స్


ఆంధ్ర, కన్నడ, తమిళ
కేంద్రాలలో దిగ్విజయముగా
ప్రదర్శింపబడుచున్న
విజయ వారి...
పాతాళ భైరవి
డైరెక్షన్
K.V. రెడ్డి, BSC (HONS)
Produced by - NAGI REDDI - CHAKRAPANI...



# చందమామ

సంచాలకుడు: చక్రపాణి

ఒక తెల్లదొర ఇండియానుండి తన దేశానికి పోతూ, కూడా ఒక గణపతి విగ్రహాన్ని తీసుకపోయాడు. విగ్రహమనేది పవిత్రమైన వస్తువనీ, దానిని భక్తితో పూజించాలనీ ఆయనకు తెలియదు. అందుచేత ఇంటికి వచ్చిన స్నేహితులందరకూ దానిని వేడుకగా చూపించేవాడు. పిల్లలు దానితో ఆడుకొనేవాళ్లు. ఒకరోజున దొరసానమ్మ ఇల్లు సర్దుకొంటూ వుండగా విగ్రహం కిందపడి, దాని ఎడమచేయి విరిగిపోయింది. మరికొద్దిరోజులకే దొరసానమ్మ మేడ మెట్లనించి జారిపడి, ఆమెకూ ఎడమచెయ్యి విరిగింది. ఇది గణపతి మహిమే అయి వుంటుందని వారనుకున్నారు. ఇంకా ఇటువంటివే మరికొన్ని చిక్కులు కలిగి, వారికి సంసారంలో శాంతి లేకపోయింది. ఆ దంపతులు తక్షణమే విగ్రహాన్ని బంగీకట్టి ఇండియాలో ఒక స్నేహితునికి పంపివేశారు. నాటినుండీ సంసారంలో శాంతికలిగి, వారు క్షేమంగా ఉంటూవచ్చారు. ఇది రెండువందల సంవత్సరాల క్రితం జరిగిన కథ. కనుక జీవంలేని వస్తువేకదా అని నిరసించకుండా, వచ్చే చవితినాడు మీరు కొనే వినాయక ప్రతిమను పవిత్రంగావుంచి, పూజించినట్లయితే, మీకు సమస్త శుభములు చేకూరుతై.

సంపుటి 9 :: సెప్టెంబర్ '51 :: సంచిక 3



# చేసిన పుణ్యం

ఏటిదరిని పచ్చంగా
దట్టమైన చెట్టొక్కటి
చెట్టుమీద గూడు కట్టి
ఉంటున్నది పిట్టొక్కటి.

ఒకరోజున ఆ పిట్టకు
క్రిందను కనుపించిందొక
కందిరీగ నీటిలోన
కొట్టుకలాడుతు ఊరక.

గట్టుకొచ్చి తన ప్రాణం
దక్కించుకునే ప్రయాస
పడుతున్నది కాని వృథా
అవుతున్నది దాని ఆశ.

ఇది చూసేటప్పటికా
పిట్ట మనసు కరిగినంత
చిన్నకొమ్మ త్రుంచి ఒకటి
రాల్చిందా ఈగచెంత.

ఈగ దాన్నియూతముగా
గొని నింపాదిగ గట్టుకు
చేరుకుంది దక్కించుక
ప్రాణాలప్పటిమట్టుకు.

రచన:
బైరాగి

కొన్నినాళ్లు గడచినంత
అవైపాక వేటగాడు
పిట్టల గొట్టేందుకొచ్చి
చెట్టుపక్క చేరినాడు.

కొమ్మపైన మన పిట్టను
చూచి సంతసించి మదిని
తుపాకెత్తి గురిచూచా
డిక కాలుద్దామనుకుని.

ఇంతలోన కందిరీగ
జుమ్మంటూ వచ్చిందటు
చూచి పరిస్థితి అంతా
దూకిందిక ఒక అదటున.

దానికాటు తగలగానె
ఎగిరిపడిన వేటగాని
చేతిలో తుపాకి జారి
నిలిచి ఉంది నేలకాని.

ప్రాణం దక్కించుక మన
పిట్ట ఎగిరిపోయిందిక.
ఎప్పటికైనా చేసిన
పుణ్యం పోదోయ్ ఊరక.






ఉపాధ్యాయుడు క్లాసులోకి వచ్చేసరికల్లా గది వేరుశెనగకాయ తొక్కలతో నిండివుంది. ఆయన మండిపడి "ఎవరీ పని చేసింది? తీసి అవతల పారపోసి రండి." అని శాసించాడు. అందరూ తొక్కలు ఎత్తి పారబోస్తున్నారు. ఒక్క పిల్లవాడుమటుకు ఏమీ చేయకుండా తన చోటులోనే కూర్చునివున్నాడు. "ఏమిరా అబ్బాయీ, నీవుమాత్రం ఊరకే కూర్చున్నావేం?" అని అడిగాడు మేష్టరు. "నేను శనగకాయలు తినలేదు. కనుక, తొక్కలు ఎత్తవలసిన పని లేదు" అని ఆ పిల్లవాడు ధైర్యంగా జవాబు చెప్పాడు.

"లేదు సార్. అబద్ధం చెబుతున్నాడు. మాతోపాటు వీడూ తిన్నాడు" అన్నారు మిగతా పిల్లలు. "అన్నీ అబద్ధాలండీ. నేను తినలేదు" అన్నాడు మళ్లీ ఆ కుర్రవాడు. మేష్టరు నమ్మలేదు. "వెధవా! ఇంతమంది చెబుతూవుంటే అబద్ధం అంటావేమిటి? ఎత్తుతావా లేదా?" అంటూ పేంబెత్తం చేత పుచ్చుకున్నాడు. మేష్టరు యిలా బెత్తం పుచ్చుకున్నాడో లేదో, ఆ పిల్లవాడు పుస్తకాలు చేతబట్టుకొని ఇంటికి వెళ్లిపోయాడు.

ఉపాధ్యాయుడు ఆ విద్యార్థి యింటికి వెళ్లి అతని తండ్రితో ఈ సంగతి చెప్పాడు. అందుకు అతనితండ్రి "అయ్యా! మా అబ్బాయి అబద్ధాలాడడు. నాకు బాగా తెలుసు. అదీకాక మావాడు బజారులో ఎలాటి చిరుతిండీ కొనుక్కు తినేవాడుకాదు. కాబట్టి మీరు వానిని తొక్కలు ఎత్తమనటంలో న్యాయం లేదు" అని చెప్పి పంపివేశాడు.

అంతటి చిన్నవయసులోనే సత్యంకోసం గురువాజ్ఞను ధిక్కరించి, ఆత్మగౌరవం కాపాడుకొన్న ఆ బాలుడు పెరిగి పెద్దవాడై మన దేశీయ మహాసభను తీర్చి దిద్దాడు. 'స్వాతంత్ర్యం నా జన్మహక్కు. దానిని నేను సాధించి తీరుతాను' అని చాటిచెప్పి, ఆ మాటను అక్షరాలా నెరవేర్చుకోగలిగిన ఆ మహానుభావుడే భారతావని ముద్దుబిడ్డడైన లోకమాన్య బాలగంగాధర తిలకు.



# వినాయకుడి దయ

సృష్టికి ఆదిలో భగవానుడైనటువంటి శ్రీమహావిష్ణువు అవతరించి, ముందుగా తన నాభికమలమందు బ్రహ్మను నెలకొల్పుకొన్నాడు. వెంటనే, 'ఓయీ బ్రహ్మ! చక్కగా ఆలోచించి నీవు ఇప్పుడే పధ్నాలుగు భువనాలను ఏర్పాటు చేయి; ఒక్కొక్క లోకంలో రకరకాల జీవకోటిని సృష్టించు' అని ఆజ్ఞాపించాడు. ఐతే, బ్రహ్మాండమైన సృష్టి చేయాలంటే ఆలోచించటానికి ఒక్క తల సరిపోతుందా? అందుకే బాగా ఆలోచించటంకోసం బ్రహ్మకు నాలుగు తలలిచ్చాడు విష్ణువు.

విష్ణుమూర్తి ఆజ్ఞప్రకారం బ్రహ్మ తన నాలుగు తలలతోనూ ఆలోచించి, సృష్టికార్యం ప్రారంభించాడు. ముందుగా పదునాలుగు భువనాలూ ఏర్పాటు చేశాడు. ఏలోకంలో ఎటువంటి జీవకోటి ఉండాలో, నిశ్చయించుకొన్నాడు.

భూలోకంలో జంతువులు, పక్షులు, వృక్షాలు, క్రిమికీటకాదులు-వీటన్నిటికంటే ముఖ్యంగా మానవజాతి ఉండాలనుకొన్నాడు. ఐతే, మానవుడు ఏ ఆకారంలో ఉండాలి? అని ప్రశ్న వచ్చింది. ఒకానొక స్వరూపం తన మనస్సులో ఊహించుకుని, మానవుని సృష్టించబోయాడు బ్రహ్మ.

కోట్లకొద్దీ మొండెములు తయారుచేసి, ఒక్కొక్కదానికి తలకాయలు అమర్చాడు. తలకు ఒక ముఖం, ముఖంలో రెండు కన్నులూ ముక్కూ నోరూ, రెండు పక్కలా రెండు చెవులూ—ఇవన్నీ అయినతరువాత శరీరానికి పొట్ట వీపు మొదలైన అవయవాలూ, రెండేసి చొప్పున కాళ్లూ, చేతులూ, కాళ్లకూ చేతులకూ ఐదేసి వేళ్లూ ఈ మోస్తరుగా తయారుచేయబోయాడు.

కాని, బ్రహ్మదేముడు ఒకవిధంగా చేయబోతే మానవుని స్వరూపం మరొక

యం. లక్ష్మి - మదరాసు




విధంగా తయారుకాజొచ్చింది. ఒక మొండెం తీసుకొని దానికి బ్రహ్మ ఒకముఖం పెడదామనుకునేటంతలో ఆ ముఖం రెండు ముఖాలుగా మారిపోయేది. రెండు కన్నులూ తీర్చిదిద్దేసరికల్లా ఈశ్వరునికి మల్లే నుదుట మూడవ నేత్రం మొలుచుకు వచ్చేది. రెండుపక్కలా రెండు చేతులు అమర్చుదామనుకొనేవాడు, పాపం! ఆ రెండింటికి మరొక రెండు వచ్చి అతుక్కునేవి. సరీగా లెక్కపెట్టి రెండేకాళ్లు పెట్టబోయేవాడు. కాళ్లు తయారుచేసిన పోగులో నించి మరి మూడు కాళ్లు వచ్చి, అవి మొత్తం ఐదు కాళ్లు అయేవి!

ఇదంతా చూచి, బ్రహ్మకు హడలు పుట్టింది. తనకు వశం తప్పిపోయి ఇటువంటి వికారస్వరూపాలు తయారు కావటానికి కారణం ఏమైవుంటుందా అని తన నాలుగు తలలతోనూ మళ్లీ ఒకసారి తీవ్రంగా యోచింపసాగాడు బ్రహ్మదేముడు. ఇలా యోచిస్తున్న సమయంలో అయన తయారుచేసిన మానవస్వరూపాలు కొన్ని నవ్వినై. మరికొన్ని పళ్లు పైకిపెట్టి ఇకిలించినై. ఇంకొన్ని స్వరూపాలు తననే కొట్టవచ్చినై. తక్కిన మరికొన్ని ముఖాలు గుడ్లు గిరగిర తిప్పి, బ్రహ్మను భయపెట్టినై. ఈ చేష్టలు చూచి బ్రహ్మకు చెప్పలేని కంగారు పుట్టింది. తను సృష్టించిన మానవస్వరూపాలే ఇలా తనకు ఎదురుతిరిగేసరికి, ఇదంతా ఎందుకు జరుగుతున్నదో తెలుసుకోలేక, బ్రహ్మదేముడు దిగులుతో తలకట్టుకు పడుకున్నాడు.

విచారంతో పడుకొన్న బ్రహ్మకు మగత కమ్మినట్టనిపించి, చిన్న కునుకు పట్టింది. ఆ కునుకుపాటులో ఒక కల వచ్చింది.— ఎదట మహాసముద్రం పెదపెద్ద కెరటాలు కొడుతూ ఘోషపెడుతూవుంది. ఆ కెరటాల పైన ఒక చిన్న మర్రిఆకు కనిపించింది. ఈ




చిత్రమేమిటా అని ఆకువైపు చూస్తూ వుండగా, అది తనవద్దకే వచ్చి, దానిపైన శిశురూపంలో ఉన్న వినాయకుని రూపం కానవచ్చింది!

అప్పుడు బ్రహ్మదేముడు—'అయ్యో, ఎంత పొరపాటు చేశాను! సమస్తమైన విఘ్నాలనూ పోగొట్టేటటువంటి ఆ ఆది దేవుణ్ణి ముందుగా తలచక ఈ సృష్టికార్యం ప్రారంభించాను. అందుకనే ఇన్ని చిక్కులు కలిగినై. ఇప్పుడైనా జరిగిన పొరపాటు సవరించుకోమని చెప్పటానికే దయామయుడైన పరమాత్ముడు ఈ రూపంతో నాకు దర్శనమిచ్చాడు' అని గ్రహించి, వెంటనే లేచి సాగరమధ్యానికి వెళ్లాడు.

అక్కడ బ్రహ్మ తదేకదీక్షతో తపస్సు చేయగా కొంచెంసేపటికల్లా నిజంగానే ఒక మర్రి ఆకు తన సమీపానికి వచ్చింది. అది సరీగా కలలో కనబడిన ఆకులాగానే కనపడగా రెప్పవాల్చక బ్రహ్మ దానివైపు చూస్తూవుండేసరికి, దానిపైన క్రమంగా వటపత్రశాయి ఐన బాలవినాయకుని దివ్య మంగళ విగ్రహం స్పష్టంగా గోచరించింది.

అంతట బ్రహ్మ ఆనందభరితుడై, నిండు భక్తితో ఆ బాలవినాయకునికి నమస్కరించి అనేకవిధాల స్తుతించాడు. "దేవా!— ముందుగా నిన్ను పూజించక సృష్టికార్యం ప్రారంభించటంవల్ల చెప్పరాని కష్టాలు కలిగినై. నా తప్పు ఇప్పుడు తెలుసుకున్నాను. కాబట్టి మన్నించి, ఇకముందైనా ఎట్టి విఘ్నాలూ కలగకుండా సృష్టికార్యం కొనసాగేటట్టు అనుగ్రహించు!" అని వేవిధాల వేడుకొన్నాడు.

అప్పుడు వటపత్రంమీదనున్న విఘ్నరాజు చిరునవ్వు నవ్వి, ఒక్కసారి తొండం అటుయిటు ఆడించి, "ఓయీ బ్రహ్మ!— నీవైనా నేనైనా నిర్వహించవలిసింది సృష్టికార్యమే కదా! సృష్టించటం నీ పని,

దానిని చక్కబెట్టడం నా పని. నేనుండగా నీకువచ్చిన భయమేమీ లేదు. ఇదుగో నీ కిప్పుడు ప్రణవమంత్రం ఉపదేశిస్తున్నాను. దీనిని జపించి, మళ్లీ సృష్టికార్యం ప్రారంభించు. ఈసారి నీ పని దిగ్విజయంగా సాగిపోతుంది" అని చెప్పి అదృశ్యుడైనాడు.

వినాయకుని అనతిప్రకారం తక్షణమే బ్రహ్మదేముడు ప్రణవమంత్రం జపించి, జపం పూర్తి అయాక మళ్లీ సృష్టికార్యం మొదలెట్టాడు. ఇప్పుడు ఎటువంటి విఘ్నాలు లేక, తలచిన పనులన్నీ తలచినట్టుగా చేయగలిగాడు. ఇదంతా వినాయకుని దయకదా అని నిశ్చయించి, బ్రహ్మదేముడు ప్రతిరోజూ ఆదిదేవుని తలచుకుని మరీ పని ప్రారంభించేవాడు. బ్రహ్మదేవుడే గాక, నాటినించీ ఆయన సృష్టించిన దేవగణమూ, పదునాలుగు భువనాలలోని ప్రాణికోటీకూడా ముందుగా గణపతిని తలుచుకొని, మరీ పనిలోకి పోయేవారు.

ఈవిధంగా బ్రహ్మదేమునంతటివాడే వినాయకుని దయ సంపాదించిగాని సృష్టి కార్యం సాగించలేకపోయాడంటే ఆ ఆది దేవుణ్ణి మానవమాత్రులు కొలువవలసిన అవసరమెంతటిదో చెప్పేదేమిటి!

కనుకనే, విఘ్నేశ్వరుడు అవతరించిన భాద్రపద శుద్ధచతుర్దశి ఒక మహాపర్వంగా ఎంచి, ఏటేటా అరోజున హిందువులందరూ ఆదిదేవుణ్ణి గొప్పగా పూజిస్తారు. వినాయకుడి దయ సంపాదించగలిగినవారు, ఎవరేమి కోరుకున్నా అవన్నీ తీరుస్తాడని ప్రజల నమ్మకం.

ఇటువంటి మహిమగల వినాయకుణ్ణి ఒక్క హిందువులే గాక, ఇతర దేశాలవారు కూడా పూర్వకాలంనించీ ఆరాధించి మేలు పొందుతున్నారనటానికి నిదర్శనాలున్నై.

మన మేలుకోసం, లోకక్షేమంకోసం వచ్చే చవితినాడు విఘ్నేశ్వరుణ్ణి తలుచుకొని మంచిమంచి కోరికలు కోరుకొందాం.






## 15

[గెడ్డపువాడిద్వారా కవల సోదరుల జన్మరహస్యం విన్నాడు రాక్షసుడు, ఉప్పొంగిపోయాడు. అతడు తన బలికి కావలిసిన ఏర్పాట్లన్ని చేయబోగా రాకుమార్తెలు వికలాంగులుగా మారిపోవటం, అదిచూచి వాడు ఉగ్రుడై గెడ్డపువాడినీ, సంధ్యా నిశీధులనూ పాతాళభవనంలో బంధించివేయటం, కొలనుచుట్టూ కట్టుదిట్టమైన కాపలా ఏర్పాటు చేసి రూపుచెడిన రాకుమార్తెలతోసహా ఎగిరిపోవటం వరకూ చదివారు. అతర్వాత—]

ఉదయనుడు అలా అదృశ్యరూపంలోనే వుండి, ముందుగతి ఏమిటా అని తీవ్రంగా ఆలోచించసాగాడు. పాతాళ భవనంలోకి పోదామంటే తన భస్మాలూ అంజనాలూ పనిచెయ్యవని రాకుమార్తెలు చెప్పే వున్నారు. అయినా అదీ చూదాంఅనే కుతూహలంతో ఉదయనుడు వెళ్లి ఆ ఆకులగుట్ట తొలగించాడు. అప్పుడు ఒక సొరంగం ఏర్పడి అందులో మెట్లు కనుపించినై. ఒక్కొక్క మెట్టే నెమ్మదిగా దిగుతూ పోయాడు. పదిమెట్లు దిగేసరికల్లా అదృశ్యరూపం పోయి మామూలు రూపం వచ్చేసింది. అయితే ఉదయనుడు జంకిపోయి అంతటితో ఆగలేదు. మరో పది మెట్లు దిగాడు. అంతే. అడుగు ముందుకు పడలేదు. మెట్లు దిగువని భయంకరమైన రెండు సింహాలువున్నై. అంతకంటే భయంకరమైన సర్పాలు వాటి మెడకు చుట్టుకొని బుసలుకొడుతున్నై. ఇవి కంటబడగానే ఉదయనుడు క్షణమైనా అక్కడ నిలవలేదు. ఒక్క వురుకులో సొరంగంబైటికి వచ్చేసి, మళ్లీ అదృశ్యరూపం పొందాడు.




అక్కడినుంచి ఉదయనుడు సరాసరి కొలనువద్దకు వచ్చాడు. కొలనుచుట్టూ అగ్నిగుండాలు భుగభుగ మండుతున్నై. రాక్షసుడి పరివారం జాగ్రత్తగా కాపలా కాస్తున్నారు. వికారరూపులైన రాకుమార్తెలను రాక్షసుడు ఎత్తుకపోయిన సంగతి ఉదయనుడికి తెలియనే తెలియదు. ఐతే యదాలాపంగా లెక్కపెట్టేసరికి కొలనులో నలభైఎనిమిది హంసలకుబదులు యిప్పుడు నలభైఅయిదు మాత్రమే వుండటంచూచి సంశయంలో పడ్డాడు. లోపించిన ఆ ముగ్గురూ రాకుమార్తెలే అనీ, వారికి ఏదో ప్రమాదం సంభవించి వుంటుందనీ అనుకున్నాడు. అయితే చేసేదేముంది? ఎవరిని అడిగితే నిజానిజాలు తెలుస్తయి? అదృశ్యరూపం మార్చి మామూలుగా కనుపించాడా, రాక్షసపరివారం తనని పట్టేస్తారు. ఏదోవిధంగా కొలనులోకి చేరుకుని హంస రూపం పొందుదామన్నా కొలనుచుట్టూ అగ్నిజ్వాలలు భగభగ మండుతున్నై. ఇంత మాత్రానికే ఉదయనుడు నిరాశచెందుతాడా? ఈ సంగతి అలా వుంచుదాం.

రాక్షసుడు ఎత్తుకుపోయిన ఆ రాకుమార్తెల గతి ఏమైందీ అని యిప్పుడు ప్రశ్న. వాడు ఒక మహారణ్యంలో వాళ్లని వదిలేశాడు. ఊరికే అమట్టున వదిలేసినా బాగానే వుండును. తన మాయాభవనపు రహస్యాలు ఎక్కడ బయటపెడతారో అనే దురుద్దేశంతో వాళ్లని మూగవాళ్లుగా చేసివేసి, తనదారిని తను వెళ్లిపోయాడు. అసలే అంగవైకల్యం ఏర్పడివున్న రాకుమార్తెలకు యిలా మూగతనంకూడా ప్రాప్తించటంతో వాళ్లు తల్లడిల్లిపోయారు. ఎలాగో కష్టపడి ఆ అరణ్యం మధ్యనుండి బైటపడదామంటే కాలుపోయిన సుభాషిణీ, కళ్లుపోయిన సుకేశినీలతో సాగిపోవటం ఒక్క సుహాసినివల్ల నవుతుందా?

అదృష్టవశాత్తు ఒకనాడు ఆ అడవికి ఒక మహారాజు వేటకు వచ్చాడు. రాకుమార్తెలను చూచాడు. అపురూపసుందరులైన ఆ పిల్లలకి యిలా అంగవైకల్యం ఏర్పడివుండటం గమనించి అతడు ఆశ్చర్యపోయాడు. "ఎవరు మీరు. ఎందుకని ఈ మహారణ్యం మధ్యని సంచరిస్తున్నారు?" అంటూ ప్రశ్నించాడు.

కాని రాకుమార్తెలు బదులు చెప్పలేక సంజ్ఞలవల్లనే తెలియచేయటానికి ప్రయత్నించారు.

వాళ్ల అవస్థచూచి రాజు "పాపం! మూగికూడానా!!" అంటూ జాలిపడ్డాడు. "చూడగా, మీరు ముగ్గురూ పెద్ద కుటుంబానికి చెందినవాళ్ళుగా కనబడుతున్నారు. ఏదో గట్టి కారణాలవల్లనే మీరు ఈ స్థితిలో ఉండివుండాలి. మీకు వచ్చిన భయమేమీ లేదు. నాతో వచ్చేయండి. మీ యింట్లో ఎంత స్వేచ్ఛగా ఉండేవారో అంత స్వేచ్ఛగానూ మీరు నా కోటలో ఉండవచ్చు. నేను మాళవదేశపు మహారాజును. నాపేరు ప్రతాపసింగు. ఈపేరు మీరు వినేవుంటారు' అని వాళ్లకు నమ్మకం కలిగేట్టుగా ధైర్యం చెప్పాడు.



ఇది వినేసరికి కష్టాలుపడుతూవుండిన రాకుమార్తెల ముఖాలు వికసించినై. ఒక్కసారిగా సిగ్గుతో వారు తలలు వంచుకున్నారు. వాళ్ల మౌనమే అంగీకారంగా తీసుకొని ప్రతాపుడు వాళ్లని గుఱ్ఱంమీద ఎక్కించి, తనుమాత్రం పాదచారిగా బయలుదేరాడు.

మరికొద్దిసేపటికి సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలతోసహా మహారాజు తన భవనం చేరుకున్నాడు. వెంటనే ఆస్థానవిద్వాంసుని రప్పించి రాకుమార్తెల వృత్తాంతం తెలుసుకునే మార్గమేదైనా వుందేమో ఆలోచించమన్నాడు.

ఆస్థానవిద్వాంసుడు బుద్ధిబలం అంతా వినియోగించి ఆలోచించాడు. రాకుమార్తె లను ముగ్గుర్నీ కూర్చోబెట్టాడు. కొంత ఇసుక తెప్పించి వాళ్లముందు పోయించి చదును చేయించాడు. సుహాసిని వేపు చూచాడు.

సుహాసిని కన్నీరు రాలుస్తూ 'చదువు నేర్చినవాళ్లము కాము' అని అర్థమిచ్చేటట్టు సంజ్ఞ చేసింది.

తనేదో గొప్ప ఆలోచన చేశాననుకున్న ఆస్థాన విద్వాంసుడు సుహాసిని ఇలా సంజ్ఞ చేయగానే ముఖం వేలవేశాడు.

'మహారాజా! నా బుద్ధికి తోచిన ఒక్క ఉపాయమూ ప్రయత్నించాను కాని మాట దక్కలేదు. ఇంతకు మించి వేరేమార్గం కనుపించటం లేదుకూడా" అని విన్న వించుకున్నాడు ఆస్థానవిద్వాంసుడు, తన అసమర్థతకు సిగ్గుపడుతూ.

'సరే' నని ఆయనని పంపివేశాడు మహారాజు. ఆ వెంటనే దాసీలను పిలిచి, "ఈముగ్గురినీ ఏలోపమూ రాకుండా అతి జాగ్రత్తగా కాపాడుతూ వుండండి. అంతః పురంలోనే వుంచి కంటికి రెప్పలా చూడండి" అని అజ్ఞాపించాడు.



సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలు ఏ విధమైన యిబ్బందీ లేకుండా మహలులో ఉంటూవున్నారు.

* * *

ఉదయనుడు క్రిందటిమారు శ్రావస్తికి వెళ్లేటప్పుడు ఒక రాజ్యం మధ్యనించి పోవటం, అక్కడ ఒక అంధుడికి చూపు రప్పించటం, అది చూచి ఆ దేశపురాజు అతనిని తనవద్ద వుండిపొమ్మనటం జరిగిందికదా!-ఇప్పుడు మన రాకుమార్తెలను అడవిలో కలుసుకొని వారిని తన కోటకు తెచ్చి వుంచిన ఆ రాజే ఈ ప్రతాపుడు!!

మాటయిచ్చినప్రకారం ఉదయనుడు తనవద్దకు తిరిగి వస్తాడనీ, అప్పుడు అతని చేత ఈ ముగ్గురికీ అంగవైకల్యం పోగొట్టించవచ్చుననీ రాకుమార్తెలను చూచిన క్షణమందే రాజు మనసులో అనుకున్నాడు.

మరోవారానికల్లా ఉదయనుడే ఈ మహారాజువద్దకు రావటం తటస్థించింది. తలవని తలంపుగా అతడు తనంతట తనే వచ్చేసరికి మహారాజు బ్రహ్మానందభరితుడయాడు. మాటప్రకారం ఉదయనుడు తన ఆస్థానంలో వుండిపోయేటందుకే వచ్చాడనుకున్నాడు అయన.




'మిత్రమా!—నీవు ఎప్పుడెప్పుడు వస్తావా? అని ఎదురుచూస్తూవున్నాం. ఇప్పటికైనా వచ్చావు. సంతోషమైంది. వెళ్లిన పని పూర్తి అయినట్టేనా?' అంటూ ఎదురువెళ్లి ఆప్యాయంగా సత్కరించాడు.

అందుకు ఉదయనుడు—"నేను తలపెట్టిన కార్యం యింకా పూర్తి కాలేదు. అందుకే తమ సహాయం కావలసి వచ్చాను" అన్నాడు.

"ఏమిటీ! నా సహాయమా? ఏమిటది? సంశయించక చెప్పవోయ్. నావల్ల ఏమి కావలసినా నీవు చెప్పి చేయించుకోవచ్చు" అన్నాడు మహారాజు.




అప్పుడు ఉదయనుడు తమ జీవిత రహస్యం బయలుపెట్టి, తను కవలలను వెతుక్కుంటూ బయలుదేరినప్పటినుంచి ఇప్పటివరకూ జరిగినదంతా వివరించాడు. తనవద్దవున్న అంజనాలూ, భస్మాలూ,— వాటి మహిమకూడా దాపరికం లేకుండా వెల్లడించివేశాడు.

శ్రద్ధగా విన్నాడు మహారాజు. "అయితే ఇప్పుడు నేను చెయ్యవలిసినది ఏమిటి?" అని ప్రశ్నించాడు.

అందుకు ఉదయనుడు "తమ ఆస్థాన చిత్రకారుణ్ణి ఒక్క పర్యాయం నాతో పంపాలి. వారంలోగా తిరిగి వచ్చేస్తాము" అన్నాడు.

సరేనన్నాడు రాజు. మర్నాడే చిత్రకారుని వెంటబెట్టుకుని ఉదయనుడు రాక్షసుడి భవనానికి చేరుకున్నాడు. తనపైనా చిత్రకారునిపైనా భస్మం చల్లాడు. ఇద్దరూ అదృశ్యరూపం పొందారు. రోజల్లా వాళ్లు కొలను ఒడ్డున వుండిపోయి మరునాడు తిరిగి మాళవరాజ్యానికి బయలుదేరారు.

బయల్దేరిన ఒకవారానికల్లా వారు రాజమహలు చేరుకున్నారు. చిత్రకారుడు తను తయారుచేసిన చిత్రాలన్నిటినీ వరుసగా పేర్చాడు. ఒక్కొక్క బొమ్మను పరిశీలిస్తూ, ఆ వెంటనే ఉదయనుడివైపు చూస్తూ వస్తున్నాడు. మధ్యలో ఒక బొమ్మవద్దకు వచ్చేసరికి చిత్రకారుడు ఉదయనుడివైపు చూచి, ఆ బొమ్మ ఉదయనుడి పక్కనే పెట్టి మళ్లీ చూచి, 'భేష్! ఇది మీకు సరీ పోయింది. ఈ వేషం వేస్తే మిమ్మల్ని ఎవరూ పోల్చుకోలేరు" అన్నాడు.

"అవును" అన్నాడు ఉదయనుడు సంతోషంతో నిండిన హృదయంతో. ఆ వెంటనే ఉదయనుడికి రాక్షసుడి అనుచరులలో ఒకనిలాగా వేషం వేశాడు చిత్రకారుడు. ఒకటికి రెండుసార్లు ఉదయనుడు అద్దంలో చూచుకున్నాడు. "బలే, మహా

బాగా కుదిరింది" అనుకుని, మరునాడే రాజువద్ద సెలవు తీసుకుని, తిరుగా కొలనుకు బయలుదేరాడు.

కొలను చేరుకుంటూనే తనవద్దనున్న భస్మంకోసమని ఎప్పటిలాగా అలవాటు ప్రకారం తడివి చూచుకున్నాడు. కాని, అయ్యో! భస్మం లేదే!

అయితే గత్యంతరం ఏమిటా అని నిశ్చయించుకొని, మరుక్షణమే ధైర్యం తెచ్చుకున్నాడు. చీకటిపడేవరకూ ఎవళ్ల కంటా పడకుండా ఒక పొదమాటున నక్కి దాక్కొని వున్నాడు.

చీకటిపడింది. రాక్షసుడి పరివారంలో మరికొందరు కొలనుదగ్గిరికి వచ్చి అంతకు ముందు అక్కడ కాపలాకాస్తున్న జట్టును విడుదల చేశారు. విడుదలైనవాళ్ళు పాతాళ గృహం చేరుకుని ఒక్కొక్కరే లోపలికి ప్రవేశించారు. చిట్టచివరివాడు గృహం లోపల ప్రవేశించబోయే సమయంలో ఉదయనుడుకూడా యుక్తిగా అతనివెంట లోపలకు దూరాడు.

తన మాయవేషం ఎక్కడ పట్టుబడిపోతుందో అని ఉదయనుడు లోలోపల జంకుతూనే వున్నాడు. అయితే దైవవశాత్తు




ఇంతవరకు అలాటిదేమీ జరగలేదు. ఏమీ అంటే—వేషం చూడగా అతడు తమలో వాడే ననుకున్నారు తక్కినవాళ్లు.

ఈసారి ఉదయనుడు మెట్లన్నీ దిగి ఆ సింహాల పక్కగానే పోయాడు. జట్టులో కలిసిపోయి వుండటంవల్ల ప్రత్యేకించి అవి తనను పసికట్టలేవని ఉదయనుడి ధైర్యం. అయితే అవి కొత్తమనిషిని ఇట్టె పసికట్టినై. పసికట్టడమేమిటి? ఒక్కసారిగా ఉరికి పైబడి చంపబోయాయి. కెవ్వున కేకవేసి ఉదయనుడు పడిపోయాడు.

ఇది చూచి, తక్కినవాళ్లంతా పరుగెత్తుకు వచ్చి, ఒక్కవేటుతో సింహాలు రెండింటినీ

నరికివేశారు. తరువాత ఉదయనుడిని వెంటదీసుకువెళ్లి చుట్టూ గుమికూడారు. "మనల్నే మాటువెయ్యబోయినయే ఈ సింహాలు. ఎంత పొగరు! మంచి బాగా శాస్తి చేశావులే" అని సింహాలను చంపిన వాడిని మెచ్చుకున్నారు.

తరువాత వాళ్లు ఉదయనుడికి పరిచర్య చేశారు. గాయాలకు కట్టు కట్టారు. కాస్తంత తేరుకున్న వెనక "తమ్ముడూ!—నీ గాయాలు పూర్తిగా మానిపోయేవరకు రెండు రోజులపాటు నువ్వు యిక్కడే వుండు. అంతవరకు కాపలా పని మేము చూచుకుంటాంలే" అన్నారు.

"అయితే మరొక్క ఉపకారం చేసిపొండి. నేను కాలు కదపలేకుండా వున్నాను. కనుక నా తిండి ఏర్పాటు కూడా చేసిపొండి, మీకు పుణ్యం వుంటుంది" అన్నాడు ఉదయనుడు.

'దానికే' మంటూ వాళ్లు ఉదయనుడికి మాంసమూ, కల్లూ తెచ్చి యిచ్చారు. తరువాత తిండికి, పడకకూ సదుపాయంచేసి ఎవరిదారిన వాళ్లు వెళ్లిపోయారు.

తెల్లవారింది. రాకసుడి పరిచారకులు కొలనుకు బయలుదేరివెళ్లి అక్కడి కాపలా వాళ్లను విడుదలచేశారు. మరికొద్దిసేపటికల్లా వాళ్లు ఉదయనుడిదగ్గరికి వచ్చి, "అదృష్టవంతుడివిరా తమ్ముడూ!" అని అనందించారు. రాత్రల్లా కాపలా కాసి వుండటాన వాళ్లు మరికొంచెంసేపటిలోనే గుర్రుకొట్టి నిద్రపోసాగారు.

సరిగా అర్ధరాత్రివేళ రాకసుడు వచ్చేశాడు. వస్తూనే మెట్లకింది సింహాలు రెండూ చచ్చిపడి వుండటం చూచాడు. "ఎవడిదిరా ఈపని?" అని బొబ్బలు పెట్టుకుంటూ ఉదయనుడు పడుకొనివున్న చోటికి వచ్చాడు. —(ఇంకావుంది)






# కలిమి లేములు

అనగనగనగా అవధాని అని ఒక పేద బ్రాహ్మడు. అవధాని గొప్ప ఈశ్వరభక్తుడు, తృప్తి కలవాడున్ను. ఆయన భార్య సావిత్రమ్మ ఉత్తమ యిల్లాలు. వారికి ముగ్గురు కొడుకులూ, ఒక కూతురున్ను.

ఆయన పేదతనానికి తోడు అంధత్వం కూడా ప్రాప్తించింది. పాపం! ఈ పెద్ద సంసారాన్ని పోషించటంకోసం ఆయన ఊరి చివరనుండే ఈశ్వరాలయానికి వెళ్లి, అక్కడ తన చింకిఅంగవస్త్రం పరుచుకొని కూర్చునేవాడు. ఆలయానికి వచ్చి పోయే భక్తులు తమకు తోచింది—ఉప్పో పప్పో, కాయో పండో, బియ్యమో రొక్కమో వేసి పోతూండేవారు. అవధానిని రోజూ ఉదయం భార్యో పిల్లలో గుడికి దిగబెట్టి, సాయంకాలం మళ్లీ ఇంటికి తీసుకుపోయేవారు.

పానకాలుశెట్టి అనే ఒక కోమటి పంచను ఉండటానికి నెలకొక్క రూపాయి అద్దె నిర్ణయించుకొని, కాస్త జాగాలో అవధాని కాలక్షేపం చేసేవాడు. శెట్టి చూడబోతే ఛండశాసనుడు. నెలా తిరిగేసరికి అద్దె చేతిలో పడకపోతే బ్రాహ్మణ్ణి అష్టకష్టాలూ పెట్టేవాడు.

ఒకరోజున దీపాలవేళ అయినప్పటికీ బ్రాహ్మడికోసం ఇంటివద్దనుంచి ఎవరూ రాలేదు. ఆయన నిరీక్షిస్తువున్నాడు. కొంత సేపటికి ఆయన భార్య వెక్కివెక్కి ఏడ్చుకుంటూ వచ్చింది. "ఏమిటి సంగతి?" అని ఆత్రంతో అడిగాడు అవధాని.

"ఇంకేమున్నది? మన శెట్టిగారు అద్దె కోసమని వాళ్ల నక్షత్రకుణ్ణి పంపించాడు. వాడు దయాదాక్షిణ్యమూ లేకుండా సామానులన్నీ వీధులోకి విసిరేశాడు. నన్నూ, బిడ్డలనూ మెడపట్టి గెంటివేశాడు" అంటూ చెప్పసాగింది. బ్రాహ్మడు విని చేసేదేముంది? ఇద్దరూ కలిసి మళ్లీ శోకాలు

యం. సోమప్ప, పరశువాకం



ప్రారంభించారు. ఇంటికి పోయి పంచకు ఎదురుగా వీధిలో ఒక చెట్టుకింద పిల్లల్ని పెట్టుకుని కూర్చున్నారు.

ఈ సమయంలో ఆకాశమార్గాన విమానంలో పార్వతీ పరమేశ్వరులు వెళుతున్నారు. సావిత్రమ్మ ఏడుపు పార్వతీదేవికి వినిపించింది. "నాథా! మన భక్తులు ఎలా దుఃఖిస్తున్నారో కనబడటంలేదా? వారి రోదన వినలేకున్నాను. ఆ బ్రాహ్మణ్ణి రేపటికి ఒక లక్షాధికారిగా చెయ్యండి" అని వేడుకొన్నది.

అందుకు పరమేశ్వరుడు "దేవీ! ఆ బ్రాహ్మణుడు తను చేసుకొన్న కర్మను అనుభవిస్తున్నాడు. త్వరలోనే అతడి కష్టాలు గట్టెక్కి, అదృష్టదినాలు బయల్పడుతవిలే," అని బదులు చెప్పాడు.

"ఏమైనాసరే, ఆ అదృష్టం ఇప్పుడే ప్రసాదింపవలసిం" దని పార్వతీదేవి పట్టుబట్టింది. కాదనలేక 'సరే' నన్నాడు పరమేశ్వరుడు.

శెట్టికి రోజూ గుడికి వెళ్లడం అలవాటు. బ్రాహ్మడు ఇంటికి వచ్చేసిన సమయంలో అతడు గుళ్లోనే ఉన్నాడు. ఎంతకూ పూజారి రాలేదు కాని, గుడిలో చిత్రమొకటి జరిగింది. ఈశ్వర విగ్రహం గణపతి విగ్రహాన్ని పిలిచి, "రోజూ మన గుడికి వచ్చే అంధబ్రాహ్మణ్ణి రేపు ఒక లక్షాధికారిగా చేయాలి" అన్నది.

"దానికేముంది? అలాగే చేస్తా" నన్నాడు గణపతి.

ఈ మాటలన్నీ ప్రతీ అక్షరమూ శెట్టి చెవుల్లో గింగురుమన్నాయి. అతడు అక్కడ ఉండే విభూతి కొంచెం తీసి పెట్టుకుని, గబగబ యింటికి చేరుకున్నాడు.

చీకటిపడిన తర్వాత స్వయంగా ఒక లాంతరు చేతపట్టుకొని చెట్టుకిందికి వెళ్లి, బ్రాహ్మణ్ణి పలకరించి నమస్కరించాడు.



"స్వామీ! మా సుబ్బడు అద్దెకోసమని మిమ్మల్ని నిర్బంధించాడని నాకిప్పుడు తెలిసింది. దుర్మార్గుడు. బొత్తిగా మర్యాద తెలియదు. తండ్రిలాంటివారు మిమ్మల్నా బాధ పెట్టడం? ఇవాళ ఎంత అపచారం జరిగింది!! ఆ తప్పు నా తప్పుగా భావించి, అద్దె సంగతి మీరు మరిచేపొండి. పొరపాటు మన్నించండి. ఇష్టం వచ్చినంత కాలం మా ఇంట్లో ఉండండి. మీకు అభ్యంతరమేమిటి?' అంటూ సామానంతా తనే పంచకిందికి నడిపి, వారిని మళ్లీ ప్రవేశపెట్టాడు.

పైగా, ఒక పదిరూపాయలు అవధాని చేతిలో పెట్టి ఆశీర్వదించమన్నాడు. గర్భదరిద్రుడే అయినప్పటికీ అవధాని ఆ డబ్బుకి ఆశపడలేదు. అప్పుడు శెట్టి వంద రూపాయలిచ్చి, "స్వామీ! ఈ సొమ్ము మీరు తీసుకోవాలి. మీ దీవనే మాకు కావలిసింది" అని వేడుకొన్నాడు. అవధాని ససేమిరా వద్దనేశాడు.

అప్పుడు శెట్టి 'అంతసందేహమైతే మీరు నా సొమ్ము ఉత్తపుణ్యానికి పుచ్చుకోవద్దు. రేపటిరోజున మీ అంగవస్త్రంలో ఏమి పడితే అదిమాత్రం నాకు ఇప్పించండి' అన్నాడు.

బ్రాహ్మడు ఒప్పుకోలేదు. శెట్టివదలలేదు. బ్రాహ్మడు వద్దంటున్నకొద్దీ, శెట్టి గబగబా తనపాట డెబ్భైఐదువేల రూపాయల వరకూ పెంచివేశాడు. అయినా, బ్రాహ్మడు అంగీకరించలేదు. అప్పుడు సావిత్రమ్మ కలగజేసుకొని, "శెట్టిగారూ! ఆయనతో ఏమిటి? మీరు చెప్పిన డబ్బు తెప్పించండి నేను వప్పిస్తాను" అన్నది. ఇంకా తనకు యిరవైఐదువేలు మిగులుతాయి కదా అనే సంతోషంతో శెట్టి డెభ్భైఐదు సంచులూ తెచ్చి అవధాని యింట్లో గుమ్మరించాడు.

మరునాడు ఉదయమే శెట్టి, అవధాని వెంట వెళ్లి అంగవస్త్రంలో ఏం పడుతుందో

వని రెప్పవాల్చకుండా అలా కనిపెట్టుకు చూస్తున్నాడు. మామూలుగా పడేటన్ని దినుసులు కూడా ఈ రోజున పడలేదు. సాయంత్రం అయ్యేటప్పటికి రెండు పుచ్చు వంకాయలు, ఒకటో రెండో కమిలిపోయిన అరటిపళ్లు పడి వూరుకున్నాయి. రోజల్లా ఉగ్గబట్టుకు కూర్చున్న శెట్టి రోషంతో గభీ మని లేచి గణపతి విగ్రహంవద్దకు వెళ్లి, 'ఏమయ్యా గణపయ్యా! నీవు బ్రాహ్మడికి ఇస్తాసన్న లక్ష రూపాయలూ ఏవి? పాపం, ఆయన ఎంత బాధ పడుతున్నాడో నీకే మన్నా తెలుసా? నోటారా వాగ్దానం చేశావే? దేముడినని చెప్పుకొంటూ నీవే ఇలా దగా చేస్తే ఇక ప్రపంచం తలక్రిందు కాదా?'—అని నిందిస్తూ తొండం పట్టుకు లాగబోయాడు. శెట్టి చెయ్యి తొండానికి అతుక్కుపోయి ఎంత గింజులాడినా వూడిరాలేదు. అప్పుడు మళ్లీ పరమేశ్వర విగ్రహం 'అంధబ్రాహ్మణుడి సంగతి ఏం చేశావు కుమారా?' అన్నట్టు వినిపించింది. అందుకు గణపతి "డెబ్భై ఐదు వేలు అప్పుడే ఇప్పించాను నాన్నగారూ, తక్కిన పాతిక వేలూ ఇస్తేనే పట్టువిడుస్తా' నన్నాడు.

ఈ మాటలు వినగానే శెట్టికి హడలుచ్చుకుంది. తక్షణమే తక్కిన పాతిక వేలూ బ్రాహ్మడికి చేరే ఏర్పాటు చేశాడు. వెంటనే అతని చెయ్యి ఊడివచ్చింది. సిగ్గుతో తల వంచుకుని ఇల్లు చేరుకున్నాడు. బ్రాహ్మడికి పార్వతీ పరమేశ్వరుల అనుగ్రహంవల్ల లక్ష రూపాయలూ లభించటమే గాక, చూపు కూడా వచ్చింది.

చూచారా, పరమేశ్వరుని లీలలు!—క్షణమాత్రంలో పేదబ్రాహ్మడు లక్షాధికారి ఐనాడు. పానకాలుశెట్టి భిక్షాధికారిగా మారిపోయాడు! కనుకనే, 'కలిమిలేములు కావడికుండలు' అని అంటారు పెద్దలు. దీన్నిబట్టి-లేదని విచారించడంకాని, ఉన్నదని విర్రవీగటంగాని అవివేకమేకద!






పూర్వకాలమందు పండరిపురంలో ఒకానొక భాగవతుడు ఉండేవాడు. అతని భార్య కమల పతిభక్తిపరాయణురాలు. ఆ దంపతులు అతిభక్తితో రుక్మిణీదేవిని ఆరాధిస్తూ ఉండేవారు. ఒకరోజున దేవి వారి ఎదుట సాక్షాత్కరించి, 'మీ భక్తికి సంతసించాను. వరము వేడుకొ'మ్మన్నది. అందుకు వారు 'నీకు తెలియనిదేమున్నది తల్లీ!—సంసార యాత్ర సుఖంగా సాగిపోవటానికి తగిన సాధనమేదో నీవే ఆలోచించి అనుగ్రహించవలసిం'దని కోరారు. అప్పుడు రుక్మిణీదేవి 'స్పర్శవేది' అనుగ్రహించింది. ఆ స్పర్శవేదితో ఏది తాకినా బంగారమైపోతుంది! అటువంటప్పుడు ఇక భాగవతునికి దరిద్రబాధ తొలగిపోయినట్టేగా? మరి, ఆ కుటుంబం నిశ్చింతగా ఉండటంలో ఆశ్చర్యమేముంది? ఐతే—'ఈ రహస్యం పిట్టకైనా తెలియనీయకూడదు సుమా! జాగర్త' అని భాగవతుడు భార్యను మరి మరి హెచ్చరించి, కట్టడి చేశాడు. ఆ ప్రకారం వారు పైకిమాత్రం బీదవాళ్లలాగానే నటిస్తూ కాలం వెళ్లబుచ్చుతూ వచ్చారు.

ఇలా ఉండగా ఒకరోజున భీమరథి నదిలో నామదేవుని భార్య స్నానము చేస్తూ ఉండగా భాగవతుని భార్య కమలావతి అక్కడకు వెళ్లింది. ఇద్దరూ లోకాభిరామాయణం ప్రారంభించారు. 'అక్కా! మా స్థితి ఏమని చెప్పుకొనేది. సంసారం గడవడం చాల కష్టంగా వుంది. నా భర్త చూడబోతే వైరాగ్యంతో తిరుగుతారే గాని ఎన్నాళ్లకూ పైసా ఆర్జించడం కనబడదు. ఎలా గడుస్తుందో ఏమిటో!' అంటూ వలపోసుకొన్నది నామదేవుని భార్య.

అందుకు కమల 'అలాగటమ్మా చెల్లీ! ఎవ్వరితోను చెప్పను అంటే ఒక రహస్యం

కె. ప్రమీల, బొంబాయి




చెపుతాను' అని చేతిలో చెయ్యి వేయించు
కొని ఇలా అన్నది : "చెల్లీ! ఈమధ్యనే
మా ఇలువేల్పు అయిన రుక్మిణీకాంత
మా భక్తికి మెచ్చి, ప్రత్యక్షమైంది. స్పర్శ
వేది అనే ఒక మహత్తరమైన వస్తువును
అనుగ్రహించింది. దానితో ఏది తాకితే అదే
బంగారమైపోతుంది. మేము దానితోనే
బంగారం చేసికొనటంవల్ల దరిద్రబాధ
పోయింది. ఇప్పుడు సంసారం బాగా సాగి
పోతూంది. ఆ స్పర్శవేది నీకు ఇస్తాను.
నీకు కావలసినంత బంగారం తయారు
చేసుకొని, దానిని మళ్లీ నాకు జాగర్తగా
ఇచ్చేసెయి. ఇదిగో ఈ రహస్యం నీ భర్త
కైనా చెప్పకూడదు సుమా!" అంటూ గబ
గబ ఇంటికి వెళ్లి స్పర్శవేది తెచ్చి ఇచ్చింది.

నామదేవుని భార్య ఆనందపరవశత్వం
పొందింది. కనపడిన వస్తువుకల్లా స్పర్శ
వేది తాకించి, బంగారం చేసుకొని దానితో
సమస్త పదార్థాలూ, కొనుక్కొని సుఖంగా
ఉన్నది. ఈ సందడిలో స్పర్శవేది తిరుగా
కమలాబాయికి ఇవ్వటం మరిచేపోయింది.

ఆమె ఇలా ఉప్పొంగిపోతూవున్న సమ
యంలో నామదేవుడు ఇంటికి వచ్చి
ఇల్లంతా బంగారం కావటం చూచి అమిత
ఆశ్చర్యపోయాడు. వంట చేసుకుంటున్న
భార్యను పిలిచి "మనకీ బంగారు పాత్ర
లన్నీ ఎక్కడివి? ఎవరిచ్చారు?" అంటూ
ప్రశ్నలు కుప్పించాడు. అందుకామె
"ముందు భోజనానికి లేవండి తరువాత
అన్నీ చెపుతాను" అని సద్దుబాటు చేయ
బోయింది.

కాని నామదేవుడు ఉగ్రుడై "ఓసీ,
ఇల్లాలా! ఈ ఆటలన్నీ నాదగ్గర సాగవు
చెప్పు!" అని గద్దించాడు. అప్పుడామె
హడలిపోతూ, స్పర్శవేదినిగురించిన వివరా
లన్నీ దాచకుండా చెప్పేసింది. అందుకు
నామదేవుడు—"దుర్మార్గురాలా! ఎంత




పని చేశావు? ధనమనేది సన్నిపాతరోగం వంటిదని తెలీదా?' 'మాతాపుత్ర విరోధాయ హిరణ్యాయ నమోనమః' అనే శాస్త్రవాక్యం వినలేదా? తే, ఆ స్పర్శవేది ఇటు తే!" అని చెప్పి అడిగి పుచ్చుకుని, వేవేగ భీమ రథికి వెళ్లి, మొలలోతు ప్రవాహంలో దిగి, స్పర్శవేదిని గిరగిర తిప్పి విసిరేసి, తేలికైన హృదయంతో ఇంటికి వచ్చేశాడు.

నామదేవుని ఇంట్లో ఇలా వుండగా, పని మీద ఊరికి వెళ్లిన భాగవతుడు ఇంటికి వచ్చి, కంటికీ మింటికీ ఏకధారగా ఏడుస్తున్న భార్యను చూచి, "ఎందుకలా విచారిస్తున్నావు?" అని అడిగాడు. దాచడానికి వీలులేక, కమల చేసిన తప్పిదం చెప్పివేసింది.

అప్పుడా భాగవతుడు నిప్పుతొక్కిన కోతి వలె గెంతులేస్తూ, "రక్కసీ! ఆడుదాని నోట్లో నువుగింజ నానదు కదా! పిట్టకైనా తెలియనీయవద్దని ఇంతా చెప్పినందుకు రహస్యం వెల్లడించడమే కాకుండా వస్తు నాశనమే చేసుకువచ్చావా? నిన్నేం చేస్తే పాపమున్నది?" అంటూ చిందులు తొక్కాడు. ఆ మట్టునే నామదేవుని ఇంటికి వెళ్ళి, "నాకు ప్రాణ సమానమైన స్పర్శవేదిని ఎలాగైనాసరే, తెచ్చి నా కిచ్చివేయి. అదిలేకుంటే నా బతుకే వ్యర్థమైపోతుంది. ఇవ్వకపోతివా, నేనూ, నా భార్యాపిల్లలు అందరమూ ప్రాయోపవేశం చేసి, నీ గడపలో ప్రాణాలు విడుస్తాము. ఈ విధంగా బ్రహ్మహత్యా పాతకం నిన్ను చుట్టుకుంటుంది" అని తన అవేదన వెల్లడించాడు. ఆ ప్రకారం భాగవతుడు కుటుంబ సహితంగా అభోజనం ఉండి, ప్రాణంమీదికి తెచ్చుకున్నాడు.

అందుకు నామదేవుడు "ఓయీ, భాగవతోత్తమా! నీ స్పర్శవేదిని భీమరథిలో విసరివేశాను. మన ఉభయుల శ్రేయస్సా

కోరే యిలా చేశాను. ధనమంటే భక్తుల్ని దేముడికి దూరం చేసే అనర్థకమైన పదార్థం. అజ్ఞానంచేత దీనికోసం లోకులు పాకులాడుతారు. మీ ఇంటిలో ప్రారంభమైన ఈ అజ్ఞానం అంటురోగంలాగ మా ఇంటికి కూడా పాకింది. అందుకనే ఈ పని చేశాను" అంటూ ధనంమీద భాగవతునికి విరక్తి కలిగించటానికి ప్రయత్నించాడు.

భాగవతుడు ఈ మాటలకు తృప్తిపడక పోవటం గమనించి, "భాగవతాగ్రేసరా! పారవేసిన మీ స్పర్శవేదిని మీకు వెతికి ఇస్తాను, రండి" అంటూ అతనిని వెంట బెట్టుకు భీమరథివద్దకు వెళ్లాడు.

నామదేవుడు అతనిని గట్టుమీద నించోబెట్టి, నదిలో ఒక్క మునకవేసి, గుప్పిలి నిండా ఇన్ని రాళ్లు తీసుకవచ్చాడు. "అయ్యా, భాగవతా! నా గుప్పిట్లో ఉన్నవన్నీ స్పర్శవేదులే. అందులో నీది ఏదో పరీక్షించి తీసుకో. తక్కినవాటికోసం ఆశపడితివంటే, నీ తల వేయి వ్రక్కలవుతుందిసుమా" అంటూ గుప్పిట విప్పాడు.

అందులో ఉన్నవన్నీ స్పర్శవేదులే, అన్నీ ఒక్కలాగునే ఉన్నాయి. తాకిస్తే బంగారుచేసే గుణం వాటన్నింటికీ ఉన్నది. ఎంత పరీక్షించినా భాగవతుడు తన స్పర్శవేదిని గుర్తించలేకపోయాడు. చివరకు విసిగి ఆ రాళ్లన్నీ నదిలోకి విసిరివేశాడు. భగవంతుని అనుగ్రహంవల్ల అతనికి విరక్తి కలిగి ఆత్మజ్ఞానం ఉదయించింది. అప్పుడు భాగవతుడు తన అజ్ఞానానికి సిగ్గుపడి, నామదేవుని కాళ్లపై పడ్డాడు.

"నాకీ రాతిరత్నాలు వద్దేవద్దు. జన్మరాహిత్యం చేసేటటువంటిన్నీ, ముక్తిప్రదమైనటువంటిన్నీ మణి కటాక్షించు" మని కోరాడు. అప్పుడు నామదేవుడు అతనిని లేవనెత్తి, 'కృతార్థుడవైనావు' అని చెప్పి పంచాక్షరీ మంత్రం ఉపదేశించాడు.






కర్పూరద్వీపరాజు కొలువులో దూరదర్శి అనే నమ్మకమైన మంత్రి ఉండేవాడు. అతని సహాయంతో రాజు అనేక సంవత్సరాలు చక్కగా రాజ్యం పాలించాడు. ఆయన ఒకరోజున మంత్రిని దగ్గరకు పిలిచి, 'దూరదర్శీ!—నాకు కాలం సమీపించింది. కనుక రాజ్యభారమంతా నీ చేతులలో పెడుతున్నాను. నా ప్రేమకు అలవాలమైన చిన్నారి రూపధరుణ్ణికూడా నీకు వప్పగిస్తున్నాను. ఎలా చూచుకొంటావే!' అన్నాడు.

'మళ్లీ ఒక్కసారి చెబుతున్నాను: కుర్రవానిని ఇష్టంవచ్చినట్టల్లా మసలనీ. కాని, తూర్పువైపున చిట్టచివరి గదిమట్టుకు ప్రవేశించనీయవద్దు. ప్రవేశించినట్టయితే తీరని కష్టాలకు పాల్పడవలసి వస్తుంది' అని హెచ్చరిక చేశాడు. 'తప్పక మీ మాట నెరవేరుస్తా' నని దూరదర్శి వాగ్దానం చేయగా, రాజు నిశ్చింతగా దేహయాత్ర చాలించాడు. రూపధరుడు పెద్దవాడవుతున్న కొద్దీ దూరదర్శి క్రమంగా అతనికి రాజ్యం హస్తగతం చేయసాగాడు. కీలకాలన్నీ విప్పి చెప్పాడు. కోట యావత్తూ వప్పగించాడు. కాని, తూర్పువైపున చిట్టచివరిగది తాళాలు మటుకు ఎన్నడూ తీయలేదు. అతడు బిగబట్టినకొద్దీ రూపధరునికి ఆ గదే చూడాలని ఆరాటం ఎక్కువ కాజొచ్చింది.

రూపధరుడు పట్టుపట్టగా, మంత్రి ఇక కాదనటానికి వీలులేకపోయింది. దూరదర్శి గదితలుపు తెరిచాడు. త్రిలోకసుందరి ఐన ఒక చక్కదనాల చిన్నదాని పటం ఎదుట కనిపించింది. అదిచూస్తూనే రూపధరుడు సోలిపోయాడు. కొంతసేపటికి తేరుకొని, 'ఈ సుందరి ఎవరు? ఇటువంటి కన్య నిజంగా భూలోకమందున్నదా? నిజంగానే ఉన్నట్టయితే, ఈమెను పెళ్ళాడని

జి. నరసింహం - నెల్లూరు



జన్మ ఒక జన్మా!' అంటూ, ఆమె చరిత్ర చెప్పమని కూర్చున్నాడు.

ఇంత జరిగినతరువాత ఇక దాచి ప్రయోజన మేమున్నది? 'ఇందువల్ల చిక్కులు రానున్నవనికదా చెప్పాడు ప్రభువు, కానీ కంఠంలో ప్రాణమున్నంతవరకు నా రూపధరునికి ఎట్టి ప్రమాదమూ రాకుండా చూస్తాను' అని మనసు దృఢపరుచుకొని, ఆ సుందరిని గురించి ఇలా చెప్పాడు:

"రూపధరా!— ఈమె హేమరాజపుత్రి స్వర్ణలత. ఈమె నివసించే కోటంతా బంగారమే! కోటలోపల గల సమస్తమైన వస్తుసామగ్రులూ బంగారమే!! ఆమెకు బంగారమంటే ఎంతో ప్రీతి. ఈవిషయంలో తృప్తిపరిస్తే, ఆమె నిన్ను వరించవచ్చు" అని రహస్యం వెల్లడించాడు. రూపధరుడు ఉప్పొంగిపోయాడు.

తక్షణమే ఖజానాలోని బంగారమంతా పైకి తీయించారు. రాజ్యంలో నిపుణులైన పనివాళ్ళనందరనూ పిలిపించారు. ఆ బంగారంతో కనివిని ఎరుగని అపురూపపు కానుకలు తయారుచేయించారు. ఒక పెద్ద ఓడనిండా వాటిని నింపుకొని, రాజూ, మంత్రీ వర్తకుల వేషంతో బయల్దేరారు.

హేమరాజ్యం చేరుకోగానే, దూరదర్శి కొన్ని కానుకలు మచ్చుకి చేత పట్టుకొని రాజపుత్రి మందిరానికి వెళ్లాడు. ఇవిచూచి ఆమె తన్మయురాలైపోయింది. దూరదర్శి 'అమ్మా!—మా వద్దగల రకాలు ఇన్నీ అన్నీ అని నోటిమాటలతో చెప్ప వలను కాదు. మీరు ఓడవద్దకు వచ్చి చూచుకో వచ్చు" అని చెప్పాడు. కానుకలపైనుండే సరదాకొద్దీ ఆమె 'ఒక్కసారి చూచి ఇప్పుడే తిరిగి వచ్చేదా' మనుకొని, పిట్టకు తెలియకుండా అతనివెంట బయల్దేరింది.

స్వర్ణలత ఓడ యొక్క సరకు చూడ నారంభించింది. చూడటమేమిటి? ఆ



అపురూపాలను తిలకిస్తూ, పరవశురాలైపో యింది. ఇది కనిపెట్టి రూపధరుడు ఓడ లంగరు విప్పేసి తెరచాపలన్నీ ఎత్తివేయమన్నాడు. అలా చేసేసరికి, ఓడ శర వేగంతో పోసాగింది.

కావలసిన కానుకలు ఎంచుకుని, స్వర్ణలత ఇక మరలిపోదామనుకునేసరికి. అప్పటికప్పుడే ఓడ నడిసముద్రంలో ఉన్నదాయె! ఆమె ఏంచేయగలదు, పాపం!— ఏదో మోసం జరిగిందని పట్టరాని దుఃఖంతో ఓడనుండి సముద్రంలోకి ఉరకబోయింది.

అప్పుడు రూపధరుడు ఆమెను చేరదీసుకొని బుజ్జగించి, తను ఫలానా అని తెలియజెప్పాడు. తన కోటలో ఆమె పటం చూడటం దగ్గరనుంచి అప్పటివరకు జరిగిన కథ అంతా వివరించేసరికి, స్వర్ణలత స్తిమితపడి, చాలా సంతోషించింది.

ఈవిధంగా రూపధరుడు ఆమెను సముదాయిస్తూవుండగా అక్కడ దూరదర్శి ఎదుట మూడుపిట్టలు వచ్చి వాలి, మానవ భాషలో యిలా మాట్లాడుకోసాగాయి:

'అక్కా!—ఈ రాజకుమారుడు కష్టపడి స్వర్ణలతను తెచ్చుకున్నాడేకాని, ఆమె అతనికి తక్కేవరకు నమ్మకంలేదు. ఏమీ అంటే, ఓడ తీరం చేరుకోగానే ఒక అందమైన పంచకళ్యాణి తయారుగా వుంటుంది. అది యెక్కి స్వారిచేదామని రాజకుమారునికి బుద్ధిపుడుతుంది. ఎక్కి ఎక్కటంతోనే ఆ గుర్రం అతనిని ఎక్కడికో తీసుకుపోతుంది. అందుచేత అతనికి రాజపుత్రితో ఎడబాటు కలుగబోతుంది' అని చెప్పింది.

"మరి, ఈ అపాయం తప్పించుకునే దారి లేదా" అని రెండవపక్షి అడిగింది. "లేకేమి? ఆ గుర్రం జీనులో ఉండే బాకు తీసి డొక్కలో ఒక్కపోటు పొడిస్తే అది చచ్చి వూరుకుంటుంది" అన్నది. "ఐతే ఈ కీలకం రాజపుత్రుని చెవినివేస్తే తగు




జాగ్రత్తలో ఉండవచ్చు కదా!" అన్నది రెండోపక్షి. అందుకు మళ్ళీ మొదటి పక్షి "అక్కడే వున్నది చిక్కు. ఈ రహస్యం అతనికి ఎవరు వెల్లడిస్తారో వాళ్ళు పాదం నుండి నడుంవరకు శిలగా మారిపోతారు సుమా" అని బదులు చెప్పి వూరకున్నది.

అంతట రెండవపక్షి 'చెల్లీ'—నీవు చెప్పిన గండం ఎలాఐనా తప్పించుకుని రాజపుత్రుడు బయటపడవచ్చు. కాని, నాకు తెలిసిన ప్రమాద మొకటి ఉన్నది. వీరు కోట చేరుకోగానే ఒక గదిలో ఆకర్షణీయమైన మధుపర్కాలు కంటపడుతై. వాటిని ఒంటిపైన వేసుకొనేసరికల్లా రక్త మాంసాలు హరించిపోయి అస్థిపంజరం మటుకు మిగులుతుంది' అని చెప్పింది.

'దీనికి విరుగుడు లేదా?' అని మొదటి పక్షి ప్రశ్నించగా, 'లేకేమి? దానిని వెంటనే అగ్గిలో పడవేసి బుగ్గిచేసివేయాలి. ఐతే—ఈ రహస్యం వెల్లడించినవాళ్ళు నడుము నుండి గుండెవరకూ శిల అయిపోతారు. కనుక, దీనిని రాజపుత్రుడు తెలుసుకొని జాగ్రత్తపడే మార్గం లేదుకదా అని విచారిస్తున్నాను" అన్నది.

అప్పుడు మూడవపక్షి 'చెల్లెల్లారా!—ఏవిధంచేతనైనా రూపధరుడు మొదటి రెండు ఆపదలనుండి తప్పించుకోవచ్చు. వీటినిమించి నాకు తెలిసిన గొప్ప గండం ఒకటున్నది' అనేసరికల్లా అది యేమిటో చెప్పమని తక్కిన పక్షులు వేగిరపెట్టినై.

అందుకు మూడవపక్షి "రూపధరుడుకీ స్వర్ణలతకూ వివాహం జరుగుతుంది. నిండు దర్బారులో పాటకచ్చేరీ జరుగుతూవుండగా రాజపుత్రి ముఖం పాలిపోయి ఆమె పడిపోతుంది. అప్పుడు ఎవరైనా ఆమెను లేవదీసి ముద్దుపెట్టుకోవాలె. లేకపోతే ఆమె చనిపోతుంది. ఐతే—ఈ భోగట్టా రాజపుత్రునికి తెలియటానికి వీల్లేదు. చెప్పిన

వాళ్లు పాదంనుండి శిరస్సువరకూ శిలగా మారిపోతారు" అంటూ విచారించింది.

ఇలా సంభాషించుకొని ఆ పక్షులు ఎగిరి పోయినై. ఇదంతా శ్రద్ధగా విని, దూరదర్శి మనసులో పెట్టుకున్నాడు. అన్నట్టుగానే ఓడ తీరం చేరుకొనేసరికల్లా ఒక వన్నెల చిన్నెల పంచకల్యాణి గట్టుమీద సిద్ధంగా వుంది. సరదాకొద్దీ రూపధరుడు దాన్ని ఎక్కబోయాడు. అప్పుడు రహస్యమెరిగిన దూరదర్శి ముందుకు ఉరికి, దాని జీనులో వుండే బాకు దూసి డొక్కలో పొడిచాడు. దెబ్బతో గిలగిల తన్నుకొంటూ పంచకల్యాణి నేలని కూలింది! అంతగా తను మక్కువపడిన ఆ గుఱ్ఱాన్ని మంత్రి పొడిచివేయటం రూపధరునికి కష్టమే అనిపించింది. ఐనా తన మంచికోసమే ఇలా చేసివుంటాడనే నమ్మకంతో ఊరుకున్నాడు.

ఈ గండం గడచినతరువాత కోట చేరుకున్నారు. రెండవ పక్షి చెప్పినట్టుగానే సరీగా ఒక గదిలో ఆకర్షణీయమైన మధుపర్కం అగుపించింది. దానిని తీసి రూపధరుడు ధరించబోయాడు. కాని, అతని వెంబడే వుండి కనిపెట్టుతూవున్న దూరదర్శి గభీమని చేతిలోని మధుపర్కం




లాక్కొని, హోమగుండంలో పడవేశాడు. అది చురచుర మండి పిడికెడు బుగ్గి ఐపూరుకుంది. ఈ అపశకునపు పనికి రూపధరుడు చాలా నొచ్చుకున్నాడు. కాని, దూరదర్శిమీది నమ్మకంతో ఏమీ అనలేదు.

మూడవ పక్షి చెప్పినట్టుగా—రూపధరుడికీ స్వర్ణలతకూ వైభవంగా వివాహం జరిగింది. పెళ్లికి గొప్ప పాటకచేరీ ఏర్పాటు చేశారు. దర్బారులో అందరి దృష్టీ కచేరీ వైపు ఉన్నది కాని, దూరదర్శి దృష్టి మటుకు రాజపుత్రిపైనే వున్నది!

కచేరీ జరుగుతూవుండగా స్వర్ణలత అకస్మికంగా పడిపోయింది! ఆమె ముఖం

పాలిపోవటం ఒక్క దూరదర్శికే తెలుసు. అతడు వెంటనే ఆమెను లేవదీసి ముద్దు పెట్టుకొన్నాడు. ఆమెకు తిరుగ ఊపిరి వచ్చింది. ఈవిడ్డూరం రూపధరునికి దుస్సహమైంది. మారు ఆలోచనలేకుండా దూరదర్శిని ఉరితీయుమని ఆజ్ఞాపించాడు.

ఉరితీసేముందు దూరదర్శి పక్షులు చెప్పిన వైనాలన్నీ వెల్లడించాడు. చివరి మాట చెప్పటం పూర్తిఅయేసరికల్లా అతడు నించున్నపాటున శిలావిగ్రహంగా మారి పోయాడు.

ఇటువంటి మంత్రిని పోగొట్టుకున్నందుకు రూపధరుడి దుఃఖానికి అంతులేక పోయింది. ఆ విగ్రహాన్ని తన పడకగదిలో స్థాపించి, 'ఏనాటికైనా శాపవిముక్తి కలిగి, నా దూరదర్శి మళ్లీ నాకు దక్కుతాడా!' అంటూ విలపింపసాగాడు.

కొంతకాలానికి ఒకరోజున మునుపటి మూడుపక్షులూ వచ్చి శిలావిగ్రహంపైన వాలినై. వాటిలో అవి మానవభాషలో ఇలా చెప్పుకొన్నై, 'నిజమైన అభిమానమే వుంటే రాజు తనకు ప్రియమైన వస్తువును అర్పించగలిగితే మంత్రి బ్రతుకుతాడు' అన్నది మొదటిపక్షి. 'ఆ వస్తువేమిటి?' అని రెండవపక్షి అడిగేసరికి, 'కొడుకును బలియిచ్చి ఆ రక్తం విగ్రహానికి అభిషేకించాలి' అన్నది మొదటి పక్షి.

దగ్గరలోనే ఆటలాడుకొంటున్న తన ఒక్కగానొక్క కొడుకును విగ్రహంవద్దకు తీసుకవచ్చి రూపధరుడు కత్తిదూశాడు. అతడు ఖడ్గంతో వేయబోయేసరికల్లా ఎవరో అతని చేయి పట్టుకొన్నట్టనిపించింది. తలపైకెత్తి చూడగా పక్షులు మూడూ లేవు. వాటిస్థానే త్రిమూర్తులు నిలబడి వున్నారు. మరుక్షణంలో వారూ అదృశ్యమయినారు. మామూలు రూపంలో మంత్రి దూరదర్శే తన చేయి పట్టుకొని వున్నాడు!!






# షికారీ

భద్రాచలం ప్రాంతమంతా గడ్డుమన్యం. అది చీమలు దూరని చిట్టడవులతోనూ, కాకులు దూరని కారడవులతోనూ నిండి వుంటుంది. ఆ అరణ్యాలలో బ్రహ్మాండమైన వృక్షాలు అకాశాన్ని అంటుతూ, పట్టపగలే చిమ్మచీకటిగా వుంటుంది.

ఇటువంటి మహారణ్యంలో పులులూ, చిరుతలూ, ఎలుగులూ, తోడేళ్ళూ మొదలైన వన్యమృగాలు స్వేచ్ఛగా సంచరిస్తూ వుంటై. నాగుపాములు బుసలుకొట్టుకొంటూ పడగలెత్తి విహరిస్తూవుంటయి. మహావృక్షాలపై సమస్తమైన పక్షిజాతులూ గూళ్లుకట్టుకొని నివసిస్తూ వుంటై.

అరణ్యాలలో సంచరించే అడవిజంతువులనూ, నాగుపాములనూ, పక్షులనూ కొట్టడమంటే జమీందారులకూ, సీమదొరలకూ చాలా సరదా. వాళ్లకు వేట ఒక ఆట! ముఖ్యంగా సెలవురోజులూ, అదివారాలు వచ్చాయంటే వేటకు వెళితేగాని దొరలకు అసలు తోచనే తోచదు. వేటకు వెళ్లి దొరగారు ఒక జంతువును కొట్టారంటే అయనకు సరదా తీరడమేగాక, గొప్ప కీర్తికూడావస్తుంది. 'ఆహా! మనదొరగారు బలే అడవిపందిని కొట్టారు!' అంటూ జనమంతా ఆయన ధైర్యాన్ని గురించీ, పౌరుషాన్ని గురించీ చెప్పుకొనటమేకాక, దొరవారిని వేనోళ్ల పొగడుతారు కూడా.

ఐతే — వేటగాండ్రకు సామాన్యంగా అడవులకుపోయి, ఇష్టమొచ్చిన జంతువులనుగాని, పక్షులనుగాని కొట్టి తెచ్చుకోవటం చేతనైవుండదు. అడవులలోని జంతువుల గమనాలన్నీ బాగా తెలిసినవాళ్ళు కొంతమంది ఉంటారు. వాళ్లను 'షికారీ' లంటారు. ఈ షికారీలు జంతువుల జాడ చెబితే, దాన్నిబట్టి వేటగాండ్రు మాటువేసి వాటిని కొడుతూవుంటారు.

త. లింగమూర్తి - భద్రాచలం



ఒకప్పుడు మాయవరంనుండి తంగవేలు అనే షికారీ వచ్చి, భద్రాచలప్రాంతంలో ఒక గుట్టమీద మకాం పెట్టాడు. వచ్చినప్పటినుంచీ అతనికి గొప్పపేరు వచ్చేసింది. అందుకని దొరలందరూ తంగవేలునే సలహా చేసేవారు. తక్కిన షికారీలు పావలో అర్థో చేతబెడితే చాలు, తిండీ తిప్పలూ లేకుండా రోజల్లా దొరవారి వెనక బొనిసలాగా తిరుగుతారు. తంగవేలు మట్టుకు అలా కాదు. ఎవరైనాకానీ, అతని ఐసకు వచ్చి సలహా పొందవలిసిందే.

తంగవేలు, గుట్ట మీది తన కుటీరం నుండి కదలనేకదలడు. అక్కడే కూర్చుని వుండి జ్యోతిష్కునిలాగా అడవి జంతువుల గమనాలన్నీ తు-చ తప్పకుండా చెప్పగలడు. 'ఫలానా అడవిలో ఫలానా దిక్కునుంచి పడమటివేపున ఉండే వాగులోకి, ఇన్ని అడుగుల ఎత్తు ఇన్ని అడుగుల పొడవుగల పెద్ద పులి సాయంకాలంవేళ మూడుగంటల ఇరవైనిమిషాలకు దప్పి తీర్చుకోవటానికి వస్తుంది' అని తంగవేలు ముందుగానే వివరాలు చెప్పేవాడు. వేటగాండ్రు గడియారం చూచుకొని, అదేసమయానికి ఆ దిశగావెళ్లి కనిపెట్టుకొనివుంటే, అతడు చెప్పిన కొలతల ప్రకారం ఆ పెద్ద పులి కచ్చితంగా వచ్చితీరేది.

ఇలా, తంగవేలు చెప్పినప్రకారం వేటగాండ్రు జంతువులను పట్టబోయేవాళ్లు. కాని, చిత్రమేమిటో ఎంతకాలానికీ ఒక్క జంతువూ వేటగాళ్లకు దొరకకుండా పోయింది.

ఒకసారి ఒక జమీందారు తంగవేలు వద్దకు వచ్చి సలహాచేశాడు. తంగవేలు మకాంచేసిన గుట్టకూ, ఎదట అడవి ఉండే కొండకూ మధ్యని ఒక యేరున్నది. ఆ యేటి ఇవతలనుంచే గురిచూచి కొట్టమని తంగవేలు వేటగాండ్రకు సలహా చెప్పే

వాడు. ఇప్పుడీ జమీందారుకూ అతడు అలానే సలహా చెప్పాడు.

ఐతే—'మనం ఇవతల గట్టుమీద ఉండటంచేత, గురి తప్పిపోవచ్చు. అవతలగట్టుమీదనే వుండి కొట్టి నట్టయితే, ఒకవేళ గురితప్పి జంతువు పారిపోయినా దానిని వెంటాడి కొట్టవచ్చు" అని తలిచి, ఆ జమీందారు ఏరుదిగి అవతలి గట్టుకి పోయి పొంచివున్నాడు. తంగవేలు చెప్పినట్టు సరీగా సాయంకాలం నాలుగుగంటల నలభై నిమిషాలకల్లా ఒక పెద్దపులి బయటకు రాసాగింది. అది రెండడుగులు ముందుకు వేసిందో లేదో, జమీందారు 'ఢాం' అని టుపాకీ పేల్చాడు.

ఆ దెబ్బకు పులి 'బాబోయ్ కొట్టకోకు!!' అని మానవభాషలో అరుస్తూ క్రింద పడిపోయింది! ఈ వింత చూచి జమీందారు పరివారంతోసహా ఆ పులివద్దకు పోగానే, పులిచర్మం చించుకొని ఒకడు బైటకు వచ్చాడు. వాని కాలికి దెబ్బతగిలి రక్తమండలమైంది. జమీందారు వానికి కట్టుకట్టి స్తిమితపరిచాడు.

తరువాత వాడిని సంగతి సందర్భాలు అడిగేసరికి, "స్వామీ!—మేము తంగవేలు




నవుకర్లం. మూడేసి తరాలకు సరిపడే సొమ్ము అతడు మాకు ఇచ్చివున్నాడు. అందుకనే మేము ప్రాణాలకుతెగించి, ఇలా అడవిమృగాల వేషాలతో సంచరిస్తూ వుంటాము. యజమాని మాకు ఏరోజుకు ఆ రోజుప్రొద్దుటే ఎవళ్లు ఏజంతువు చర్మంలో దూరి ఎన్నిగంటలకు ఏ తావుకు రావాలో చెబుతాడు. ఆప్రకారం మేము ఇక్కడ సంచరించాలి" అంటూ చిత్రమైన తన చరిత్ర చెప్పాడు.

మరునాడు జమీందారు తంగవేలు బసకు వెళ్లాడు. కాని, అప్పటికప్పుడే అతని కుటీరం ఖాళీ ఐపోయి వున్నది!!




## 5

మిథిలాపట్టణాన్ని ఏలిన జనకమహారాజు గొప్ప వేదాంతి. ఆయన రాజ్యంలో ఆడంగులూ, పిల్లలూకూడా వేదాంతులే అని వాడుక. ఈమాట ఎంతవరకూ నిజమో చూడాలని ఒకప్పుడు నారదమహర్షికి బుద్ధిపుట్టి, మిథిలానగరం చేరుకున్నాడు.

అలసట కలగటంవల్ల నారదముని చెయ్యి తలక్రింద చేర్చి ఒక చెట్టునీడను విశ్రమించాడు. అది ఒక నీలాటిరేవు. అందుచేత ఆ ప్రాంతంలో అమ్మలక్కలు ఊసులాడుకొంటూ, వస్తూ పోతూవున్నారు. అందులో ఒకామె రేవుకి వెళ్ళుతూ చెట్టుకింద పడుకొనివున్న నారదుణ్ణి చూచి "ఒస్సి, ఇదేమిటమ్మా అక్కా! వాలకం చూడగా పైకి మహామునిలాగా కనబడుతున్నాడే కాని, తలగడా లేందీ నిద్రపట్టదు కాబోలు ఈయనకు. చెయి తలదిండుగా చేసుకుని ఎంత హాయిగా పడుకున్నాడో, పాపం!! ఈయనకు అన్నీ ఉడిగినై కాని దేహాభిమానం ఇంకా పోయినట్టు లేదే" అంటూ వెళ్ళిపోయింది.

ఈ మాటలు చెవిని పడగానే నారదుడు గభీమని తలకింది చెయ్యి తీసివేసి ఏమీ ఎరగనట్టు పడుకున్నాడు. ఇందాకటి ఇల్లాళ్ళు రేవునుండి నీళ్ళు ముంచుకు తిరిగి వస్తూ మళ్ళీ ఆయనవైపు చూచారు. మునుపు మాటాడినఆమె, స్నేహితురాలితో "చూచావే అక్కా!—ఈ యతీశ్వరుడికి దేహాభిమానమే కాదు. అసలు ఆత్మాభిమానమే చావలేదు. నే నిందాక అన్న మాటలకు అభిమానపడి రోషంకొద్దీ తలకింది చేయి తీసివేశాడు. ఇంత అహంకారమున్న ఈయనకూడా ఒక ఋషేనా!" అంటూ పెదవి విరిచింది.

ఇలా సంభాషిస్తూ ఇద్దరూ నవ్వుకొని ఇంటికి వెళ్ళిపోయారు. ఆశ్చర్యంతో నారదుడు రెండవకంటివానికి తెలియకుండా తన లోకానికి తను వెళ్ళిపోయాడు.

## 6

వెంకటరెడ్డి ఒకప్పుడు బాగా బ్రతికినవాడు. దేహీ అని ఒకరికి చెయ్యిచాచి ఎరుగడు. ఒకరివల్ల మాటపడినవాడూ కాదు. ఐతే, కాలం ఎప్పుడూ ఒకే విధంగా వుండదుకదా? గొప్పగా బ్రతికిన రెడ్డి స్థితిగతులు తారుమారైపోయి, పూటకి తికానా లేని స్థితి ఏర్పడింది. ఇంతటి హీనస్థితికి వచ్చినా, పరిస్థితులకు రెడ్డి లొంగలేదు. పస్తుపడి ఐనా వుండేవాడు కాని ఒకరిని ఆశ్రయించేవాడు కాదు.

ఒకనాటి ఉదయం రెడ్డి వీధి అరుగు మీద కూర్చునివుండగా, కూరలమ్ముకునే మనిషి గుమ్మం ముందు నించి పోతూ వుంది. "అమ్మీ! వంకాయ లెలా?" అని అడిగాడు రెడ్డి. "వీశె ఐదు అణాలు బాబూ!" అన్నది కూరలమ్మి. "చాలా ధర చెబుతున్నావే! మూడణాలకు యివ్వలేవూ?" అని మళ్ళీ అడిగాడు. "కొన్నావు లేవయ్యా! మూడణాలు కాదు మూడు దమ్మిడీలకిస్తే మాత్రం నువ్వేం కొనగలవ్?" అంటూ కూరలమ్మి తట్ట నెత్తికెత్తుకోబోయింది. రెడ్డి హృదయానికి ఈ మాటలు బాణాల్లా గుచ్చుకున్నై. "పరువూ మర్యాదా పోయాక బ్రతికేం, చచ్చేం" అంటూ మూలనున్న దుడ్డుకర్రతో రెడ్డి కూరలమ్మి తలమీద ఒక్కటి వేశాడు. దెబ్బతో అది హరీఅన్నది.

వెంకటరెడ్డి తిన్నగా పోలీసుస్టేషనుకు వెళ్ళి జరిగినదంతా ఇన్‌స్పెక్టరుతో చెప్పివేశాడు. ఇన్‌స్పెక్టరు ఆశ్చర్యపోయాడు. "వట్టి పిచ్చివానిలా వున్నావే. ఈపాటిదానికేనా ఇంత దారుణం!" అన్నాడు. "నా బాధ మీరు గ్రహించలేరు..." అన్నాడు రెడ్డి చలించకుండా. "నిన్ను ఉరితీస్తారు తెలుసా?" అన్నాడు ఇన్‌స్పెక్టరు. "తెలుసు. ఈ గుక్కెడు ప్రాణం ఉంటే ఎంత, పోతే ఎంత, ఇంత పరాభవం జరిగింతరవాత!" అన్నాడు రెడ్డి. మరి కొద్దిరోజులకే రెడ్డిని ఉరితీశారు. 'పాపం! బ్రతికి చెడినవాడు' అంటూ సానుభూతి వెల్లడించింది లోకం.

అగష్టునెల మాకు వచ్చిన చిట్టికథలలో పై రెండు కథలూ బహుమతి పొందినై.

5-వ కథ—వ్రాసినది: డి. జయరాం, శ్రీకాకుళం.—బహుమతిగా ఇతనికి రంగు పెన్సిళ్ల పెట్టె ఒకటి పంపుతున్నాం. 6-వ కథ—వ్రాసినది: యస్. జగన్నాథరావు, నల్లగొండ.—బహుమతిగా యితనికి హిందీ స్వబోధిని ఒకటి పంపుతున్నాం.




రామరావణాయుద్ధం ముగిసిందీ అన్నారు. ముగియటమే కాదు. శ్రీరాముడు రామావతారం చాలించి, కృష్ణావతారం ఎత్తేశాడు.

అది ఉత్తుంగ మహాతరంగాలతో కూడుకొనివున్న సముద్ర తీరం. ఆ సముద్ర తీరానికి వచ్చి చూస్తున్నాడు అర్జునుడు. "ఈ సముద్రానికే కాబోలు, రాముడు పోగుజేసి తెచ్చిన కపిశ్రేష్ఠులంతా లంకకు వారధి కట్టారు! కోతుల సాయం లేనిదీ ఒక్క అడుగుకూడా వేయలేకపోయాడే ఆ శ్రీరాముడు. అంత చేతకానివాడిలాగా కనపడుతున్నాడే ఆ రాముడు. నేనే ఐతేనా? రెండి ఘడియలలో నా శరపరంపరతో వారధి నిర్మించివేసేవాడిని కదూ! ఈపాటి పనికే ఆ మర్కట వీరులు మహాపర్వతాలు దొర్లించుకువచ్చి క్రిందుమీదులు పడ్డారు" అని ఈ విధంగా ఆత్మస్తుతి, పరనింద చేసుకొంటూ కూర్చున్నాడు.

ఇంతలోనే అక్కడికి వచ్చాడు ఆంజనేయులు. "ఎవరయ్యా నీవు? ఏమిటి అంటున్నావు?" అని గదించాడు, భుజం మీది గదను క్రిందికి దింపుతూ.

"ఈ కోతి యేదో వాగుతున్నదే! సేతు రక్షణకోసమేనా అది యిలా తిరుగులాడుతూవుంట?" అని తనలో అనుకున్నాడు అర్జునుడు. ఇలా అనుకొంటూ, పైకిమాత్రం ఆంజనేయుని ప్రశ్నకు బదులుగా, "ఏమీ లేదు. నీ రూపం ఎంత సౌందర్యంగా ఉన్నదో వర్ణిస్తున్నా" అన్నాడు.

ఈ మాటలకు ఆంజనేయుడు ఉగ్రుడయ్యాడు. "ఏమిటీ!—నన్నే వెక్కిరిస్తున్నావ్? ఈ గదాదండం నీ శిరస్సుని వేయి ముక్కలు చేస్తుంది, జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

"జాగ్రత్తకేంగాని, ముందు నీ వెవరవో చెప్పు. పాండుమధ్యముడైన అర్జునుడు

దద్దనాల వీరభద్రరావు - తాడేపల్లిగూడెం

అడుగుతున్నాడు" అన్నాడు, గాండీవం మీటుతూ.

"మా భీముని సోదరుడవా! అందుకనే మొదటి తప్పుగా క్షమించాను. ఇటుపైన మాత్రం నా రాముని దూషించితివా నా వాలంవచ్చి నీ మెడకు ఉచ్చు బిగిస్తుంది" అన్నాడు హనుమ.

"ఓహో, రాముని కుడిభుజమైన వాయుసుతుడవా నీవు? చూడగానే అనుకొన్నానులే. అన్నట్టు, వారధి కట్టడానికి నీవూ మోశావుగా మహాపర్వతాలు? చేతిలో వుండే తూణీరాలతో సేతుబంధనం చేయలేక, పర్వతాలకోసం పరుగులెత్తించిన ఆ చేతకాని ప్రభువు నెట్లా కొలిచారయ్యా, మీరంతా?" అన్నాడు అర్జునుడు.

"ఆఁ! - ఆఁ!! — నా ప్రభువునే పరిహసిస్తావుగా?" అంటూ గదను భుజంమీదకు ఎత్తబోయాడు అంజనేయుడు.

"అహ్హహ్హ! — మర్కట వీరుడికి మిడిసిపాటు ఎక్కువగానే వున్నదే!" అని లాఘవంగా అన్నాడు అర్జునుడు.

అందుకు హనుమ, "ఏదయ్యా, నీ బాణాలతో వారధి నిర్మించు చూదాం. నిమిషంలో దానిని పెటపెట విరుగగొట్టి



సముద్రంలో కలిపివేస్తా. ఆ పనే చేయలేని నాడు నీకు నేను అజన్మాంతమూ దాస్యం చేస్తా. ఇదే నా ప్రతిజ్ఞ" అంటూ సవాలు చేశాడు.

అప్పుడు సవ్యసాచి "ఈ మాట ఖాయమేనా? నేను నా ప్రజ్ఞవల్ల దుర్భేద్యమైన సేతువు నిర్మించలేకపోతినా, ఈ క్షణమందే అగ్నిప్రవేశం చేస్తా. ఇదే నా శపథం" అంటూ మారుప్రతిజ్ఞ చేశాడు. రివ్వుమని ఒక్క బాణం వదిలి, దానివెనుక శరపరంపరలు వేసి అద్భుతమైన వారధి నిర్మించాడు. అంజనేయుడు వారధి సమీపించి, బొటనవ్రేలితో అట్టె నొక్కి చూచాడు. ఆ



అదుముతో వారధి పెళపెళామని విరిగి నీట కలిసింది!

అర్జునుడు ఆశ్చర్యపోయాడు. "నా విల్లంబులూ విలువిద్యా ప్రావీణ్యమూ ఇదేనా! ఇంతేనా!!" అనుకొని, అగ్నిప్రవేశానికి అయత్తపడబోయాడు.

ఇదిచూచి మారుతి, 'అర్జునా!—ఇక నెప్పుడూ ఇటువంటి పందేలు వేయక, నీ దారిని నీవువెళ్లు. అగ్నిప్రవేశం చేయటానికి ఇక్కడ నిప్పురవ్వ దొరకదు..." అన్నాడు సానుభూతి చూపుతూ.

అర్జునుడు పౌరుషంతో "పాండవులు అసత్యవాదులూ, అసమర్థులూ అనుకోకయ్యా ఆంజనేయా!—" అనిచెప్పి, సంధించి ఒక్క బాణం భూమిలోకి కొట్టాడు. వెంటనే అగ్నిజ్వాలలు ఎగసి వచ్చినై. "హే కృష్ణా! కృష్ణా!! అపద్ధారకా!!!—" అని ప్రార్థన చేసికొంటూ, ఆ జ్వాలలలోకి దుముకబోయాడు. ఆంజనేయుడు ఎంత వారించినా అతడు ఆగలేదు.

అంతలో ఒక వృద్ధబ్రాహ్మణుడు వచ్చి "ఆగు! ఆగు!! ఏమిటీ అఘాయిత్యం!!! ఆత్మహత్య చేసుకోవటం మహాపాపం కాదా?" అంటూ అర్జునుణ్ణి ఆపివేశాడు. అప్పుడు ఆంజనేయుడు బ్రాహ్మణుడితో జరిగిన సంగతి అంతా చెప్పి, తమతమ ప్రతిజ్ఞలను గురించిన వివరాలు ఆయనకు వెల్లడించాడు.

అంతా విని ఆ బ్రాహ్మడు "బాగానే వుంది. ఐతే ఇటువంటి విషయాలలో మధ్యవర్తి లేకుండావుండటం సబబుకాదు. సరే, ఇప్పుడు నేనున్నానుకదా యిక్కడ. అర్జునా! ఏదీ, ఈసారి నీవు నీ బాణాల మహిమతో నేర్పుచూపి సేతువు కట్టవోయ్. ఆంజనేయా!—జరిగినదానికేం, ఇప్పుడు అర్జునుడు మళ్లీ సేతువు కడతాడు. దానిని

నీ భుజబలంవల్ల ఛేదించు, చూదాం" అని చెప్పగా ఆయన పెద్దమనిషిగా ఉండటానికి ఇద్దరూ వప్పుకొన్నారు.

రెట్టించిన ఉత్సాహంతో పార్థుడు బాణాలను కొట్టి సేతువు నిర్మించాడు. హనుమ కుప్పిగంతులు వేసికొంటూ వెళ్లి, మునపటి లాగానే బొటనవేలితో అదమబోయాడు. సేతువు కదలలేదు అణచిపెట్టాడు. ఔసగ లేదు. పాదాలతో తొక్కిపట్టి ఏమో చేయబోయాడు, అది జంకలేదు. బలమంతా ఊగ్గబట్టి ఆఖరుసారి ప్రయత్నించి చూచాడు, వారధి చెక్కుచెదరలేదు!

ఈ వారధి మామూలు వారధి కాదనీ, ఆ వచ్చిన విప్రుడు సామాన్యుడుకాడనీ వెంటనే గ్రహించాడు అంజనీపుత్రుడు. భక్తిపరవశుడై హనుమ ఆ బ్రాహ్మణునికి సాగిలబడి "రామా!—సుగుణాభిరామా!! నీవు నన్నీవిధంగా పరీక్షింపవచ్చావని తెలుసుకోలే ననుకున్నావా? వారధిలో నీ మహత్తర శక్తిని ప్రవేశపెట్టిన సంగతి కనిపెట్టలేననుకొన్నావా? ఎన్నాళ్లకు దర్శనమిచ్చావు తండ్రీ! ఈనాటికా నీకు నాపైన కరుణ కలిగింది!! ఏదీ, నీ దివ్యమంగళ రూపం ఒక్కసారి చూపవూ!!!—"అంటూ



పాదాలపైన సోలిపోయాడు. అంతట బ్రాహ్మడు హనుమను ప్రేమతో లేవదీశాడు. హనుమ తల పైకిఎత్తి చూచేసరికల్లా బ్రాహ్మడు మాయమై, అతనిస్థానే తన ప్రభువైన శ్రీరామచంద్రమూర్తి సాక్షాత్కరించాడు.

"హనుమా!—అర్జునుడు పరాయివాడనుకున్నావా? మీ రిద్దరూ సమబలులు. ఒక రెక్కువ, ఒకరు తక్కువఅనే మాటలేదు, మీరు ప్రతిజ్ఞలు పట్టినట్టయితే లోకాలు గజగజలాడిపోతై. కనుక, మీ ఉభయులూ మీమీ బలాబలాలను లోకహితంకోసమే వినియోగించాలి. త్వరలోనే భారత మహా

యుద్ధం రాబోతున్నది. ఆ యుద్ధంలో మళ్లీ మనమందరమూ కలిసి పనిచేయాలి. లేకుంటే నా విధి నేను నెరవేర్చుకొనట మెట్లా? ఐతే, అది ఎలాగా అని అడుగుతావేమో!—అప్పుడు నేనే కృష్ణుడనై యుద్ధరంగమందు పార్థునికి సారథ్యం చేస్తూవుంటాను. నీవు అర్జునుడి రథాన్ని అలంకరించే జెండాపైన కనిపెట్టుకొని వుండి, విజయుడికి విజయం చేకూరుస్తూవుండాలి. నీ స్వరూపం చిత్రించుకొన్న అతని రథ జెండా 'కపిధ్వజ' మనే పేరుతో వాడుకలోకి వస్తుంది" అన్నాడు.

"రామా! మహా ప్రసాదం. ధన్యుణ్ణయాను" అని చేతులు కట్టుకు నిలబడ్డాడు అంజనేయుడు.

అతడు కనుమూసి తెరచేటంతలో ఆ బ్రాహ్మణుడు అంతర్హితుడయాడు. అంతట రామనామం స్మరించుకొంటూ హనుమ ఉదయాద్రి చేరుకొన్నాడు.

అంజనేయుని చేష్టలు చూస్తున్న అర్జునుని కేమీ బోధపడలేదు. బ్రాహ్మణుడు నిలబడ్డ దిక్కుకి అట్టె చూడగా విప్రునికి బదులు తన కృష్ణుడే సిద్ధమయ్యాడు. కృష్ణుడు అతన్ని చేరదీసుకొని, "బావా! ఎదటి బలాబలాలు తెలుసుకోకుండా యెందుకోయ్ పందేలు వేస్తూవుంటావు? అంజనేయుడంటే సామాన్యుడనుకున్నావా? అతడు మహాభక్తుడు. నీలాగనే అజేయుడు. కనుక, జాగ్రత్తగా ఉండాలి. అవునుగాని, తొందరపడి అగ్నిప్రవేశం చేయబోతివే! అదేంపనోయ్ అడదానిలాగా? ముందున్నది ముసుళ్ళపండగ అన్నట్టు, అసలు భారత యుద్ధమంతా ముందేకదా వున్నది? ఆ యుద్ధాన్ని నడిపించటం కొసమేకదా మనమిద్దరమూ ఇప్పుడు అవతరించింది? అంతా మరిచావా?" అంటూ మందలించి, కపిధ్వజాన్ని గురించిన కథను తెలియజెప్పాడు.



# చందమామ పజిల్
(భాషాభివృద్ధికి)

అడ్డము:

2. పావడ
4. అలస్యము
6. ఒక దుస్తు
8. మక్కువ
10. అర్ధంకి
13. గుంపు
14. అగ్ని
16. లక్ష్మి
17. తపస్సు
19. బాణము
20. త్రోవ




నిలువు:

1. సముద్రదము
3. సూర్యుడు
4. $7\frac{1}{2}$ గడియలు
5. లక్ష్యము
7. జాలి
9. వివాహము
11. ధనవంతుడు
12. ఆపద
15. దుఃఖము
18. శివుడు
19. పెద్ద అడుగు

# చిన్న మేకు

★

కొంచెం నిర్లక్ష్యంతో
కొంప మునిగి పోయింది!

*  *  *

చిన్నమేకు ఊడిపోయి
నాడా పడిపోయింది.
నాడా లేక డెక్కలరిగి
గుర్రం పడిపోయింది.
గుర్రం పడిపోగానే
రౌతు కూలిపోయాడు.
రౌతు కూలిపోగానే
యుద్ధ మోడిపోయారు.
యుద్ధమోడిపోగానే
రాజ్యం కోల్పోయారు.

*  *  *

చిన్నమేకు ఇంతచేసి
కొంప ముంచి పోయింది!




# రంగు రంగుల నీళ్లు

ఇంద్రజాలికుడు తనకు దగ్గిరగా టేబుల్ మీద ఒక గాజుకూజానిండా నీళ్లు, ఏడు ఖాళీ గ్లాసులూ పెట్టుకుని ఉంటాడు. స్టేజి వెనకభాగంలో నల్లనితెర వ్రేలాడుతూ వుంటుంది. ఈ తెర కట్టివున్న భాగం ఏమాత్రం వెలుతురూలేక చీకటిగా వుంటుంది. అంతే, స్టేజిమీద ఇంకేమీ ఉండవు. ప్రేక్షకులు కావాలంటే ఆ గ్లాసులు సబ్బునీళ్లతో శుభ్రంగా కడిగి పెట్టవచ్చు.

ఇంద్రజాలికుడు కూజాలో నీళ్లు ఒక గ్లాసులో పోసి, 'మీకేరంగు నీళ్లు కావాలి?' అని ప్రేక్షకులను అడుగుతాడు. 'ఎర్రటి నీళ్లు కావాలి' అని ఒకరు అడిగారనుకోండి. అతడు ఆ గ్లాసు పైకెత్తి కాస్సేపు అటూ ఇటూ కదిలించగానే అవి ఎర్రటి నీళ్లుగా మారిపోతాయి. మరొకరు 'పచ్చటి నీళ్లు కావాలి' అని అడిగారనుకోండి. మరొకగ్లాసులో మామూలు నీళ్లు పోసి, ఆ గ్లాసు పైకి యెత్తి మళ్లీ అలా కాస్సేపు అటూయిటూ కదిలించగానే పచ్చటి నీళ్లుగా మారిపోతాయి. అలా ఆ ఏడు గ్లాసుల్లోనూ మామూలు నీళ్లే పోసి, ఏడు రంగుల నీళ్లనుగా మార్చవచ్చు.

అసలానీళ్లలో ఇంద్రజాలికుడు ఏదో మందు కలిపి ఉంటాడనో, లేక మాయో మంత్రమో ఉంటుందనో అనుకుంటారు మీరు. కాని, అసలు సంగతి అది కాదు. దీని కిటుకు యిది.

స్టేజిమీద ఇంద్రజాలికుడి తలపైన అడ్డంగా ఒక దారం కట్టి ఉంటుంది. ఆ దారానికి నిలువుగా మూరెడు మూరెడు పొడుగున కొంచెం ఎడంగా ఏడు రంగు దారాలు వ్రేలాడకట్టి ఉంటాయి. ఎరుపు, పసుపుపచ్చ,



ఆకుపచ్చ, నలుపు, నీలం, వైలెట్, ఆరెంజి, రంగుల దారాలు కట్టి ఉంటాయనుకోండి. తాను నుంచున్న చోటుకు చేతికి దగ్గిరగా ఎరుపు దారం, తర్వాత నల్ల దారం, తర్వాత పసుపు అలా గుర్తుగా ప్రదర్శనం మొదలుపెట్టే ముందుగానే కట్టి ఉంచాలి. ఈ దారాలు వ్రేలాడుతున్న చోట మాత్రం పూర్తిగా చీకటిగావుండాలి. ఇది చాలా ముఖ్యం. ఎందుచేత నంటే ఆ చీకటిలో దారాలు ప్రేక్షకులకు కనిపించవు. కనుక ఈ ట్రిక్కు రాత్రిపూటనే చెయ్యటానికి మాత్రం వీలు అన్నమాట.

ప్రేక్షకులు ఫలానా రంగు నీళ్లు కావాలి అన్నప్పుడు ఇంద్రజాలికుడు ఆ రంగుదారం ఎంత దూరంలో ఉందో గుర్తు ఉంచుకుని, జాగ్రత్తగా ఆ దారం ఆ నీళ్లలోకి వచ్చేట్లుగా గ్లాసును ఎత్తి పట్టుకోవాలి. ఆ దారం ఈ గ్లాసు నీళ్లలో మునగగానే ఈ నీళ్లన్నీ ఆ రంగుగా మారిపోతాయి.

అన్నిటికన్నా మరొక ముఖ్యమైన విషయం కూడా మీరు గుర్తుంచుకోవాలి. ఇంద్రజాలికుడు గ్లాసునీళ్లలో ఏదో ముంచుతున్నట్లు ప్రేక్షకులు కనిపెట్టలేనంత చాకచక్యంతోనూ, చాల త్వరగానూ చెయ్యాలి. కొంచెం అనుభవంమీద యిది చెయ్యటం తేలికే అవుతుంది. అయితే ఇది పైకి చాలా సులభమైన ట్రిక్కుగానే కన్పిస్తుంది కాని, నిజానికి అంత సులభమైంది కాదు. ఇంద్రజాలికుడు ఏపాటి అజాగ్రత్తగా ఉన్నా మొదటికే మోసం వస్తుంది.






పాఠకులు ఈ గారడిని గురించి యింకా వివరంగా తెలుసుకోదలిచితే, వారు 'చందమామ' పేరు ఉదాహరిస్తూ ప్రొఫెసరుగారికి నేరుగా వ్రాయవచ్చు. మీరురాసే ఉత్తరాలు ఇంగ్లీషులోనే వుండాలి. ఇది అతి ముఖ్యం.

ప్రొఫెసరుగారి అడ్రసు యిది:
ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్,
12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్,
కలకత్తా - 19.

# రంగు వెయ్యండి—3-వ బొమ్మ కథ

కష్టసాధ్యమైన మంచుకొండను ఎలా ఐతేనేం, రాకొమారుడు ఎక్కగలిగాడు. కొండపైన భవనం కనిపించింది. ఆ భవనం ప్రవేశించటానికి వీలుగా ఒక పెద్ద ద్వారంకూడా కనిపించింది. అది తెరిచేవుండటంచేత సులువుగా ప్రవేశించవచ్చుననుకున్నాడు రాకుమారుడు. తీరా గుమ్మంవద్ద అడుగు పెట్టగానే ఒక కోటి సింహాలు బొబ్బరించినట్టుగా చెవులలో ధ్వని హోరెత్తిపోయింది. కాని, అది ఎక్కడినించి వస్తున్నదీ, ఎలా వస్తున్నదీమటుకు ఎంత యత్నించినా తెలుసుకోలేకపోయాడు. చివరకు ఇదేదో అదృశ్యరూపంలో వుండే మహాశక్తి అని నిశ్చయించి, ధైర్యంతో ముందుకు చొరుచుకుపోయాడు. ధ్వని ఆగిపోయింది.

ఇది దాటిన మరికొంచెం దూరంలో అంతకంటె మరిఒక పెద్ద ద్వారం కనపడింది. ఇక్కడ అడుగు పెట్టగానే కన్నులు మిరుమిట్లుకొలిపే భీతావహమైన జ్వాలలు కనిపించినై. ఏమైనా కానీ అని చెప్పి, అతడు వెనుకకు జంకకుండా సాహసించి జ్వాలల్లోంచి ముందుకు పోయాడు. జ్వాలలు మాయమయినై.

మరికొంచెం దూరం సాగిపోగానే, తన నేత్రాలను తనే నమ్మజాలనితీరుగా ఒక చిత్రమైన కొలను కంటబడింది. కొలను ఎదట బ్రహ్మాండమైన మూడవ ద్వారం కనబడుతూనేవున్నది. ఐతే ఎంత లోతు ఉంటుందో తెలియక ఎలా దిగటం? ఐనా, చొరవచేసి దిగబోయాడు. నిజానికి అక్కడ నీళ్లు లేవు. కాని కాలు జారినట్టనిపించింది. ఇదికూడా ఒక మహిమేనని రూఢిపరుచుకుని, ఆ మాయకోనేరు దాటుకొని అతడు మూడవ ద్వారం చేరుకున్నాడు.

అప్పటికి రాకొమారునికి బాగా అలసట కలిగింది. ఐనా, పట్టువిడువలేదు. ద్వారం దాటిపోగానే, తను ఎవరికోసమైతే తపించిపోయాడో ఆ మహానుభావుడు ఒక విశాలమైన గదిలో తపస్సు చేసుకుంటూ కనిపించాడు. అమావాస్య యింకా వున్నదికదా, మహానుభావుడు లేచి తనతో మాటాడతాడు అనే కుతూహలంతో రాకొమారుడు చడిచేయక అలా ఒకప్రక్కగా ఒదిగి నిలబడే వున్నాడు. అప్పటికప్పుడే అమావాస్య వెళ్లిపోయి పాడ్యమి ప్రవేశించిందనీ, మహానుభావుడు మళ్లీ జపంలో కూర్చున్నాడనీ పాపం, అతనికి తెలియనే తెలియదు.

రోజులతరబడిగా తిండీ నిద్రా ఎరుగని రాజకుమారుడు బడలికచే సోలిపోయి, తనకు తెలియకుండానే ఆ మహానుభావుని పైన పడిపోయాడు. మహానుభావుడు కన్నులు మూసికొనే, కుడిచెయ్యి పైకి ఎత్తాడు. తక్షణమే రాకుమారుడు సరాసరి పైకి వెళ్లి భవనపు కప్పుకు వేలాడిపోయాడు.




రంగు వెయ్యండి (కథ): 4-వ బొమ్మ

# చేసి చూడు

నిండా నీళ్లు కలిగినటువంటి ఒక సీసా తీసుకో. ఒక గదిలో ప్రవేశించి, తలుపులు మూసివెయ్యి. కిటికీలకు ఒక నల్లటి గుడ్డ గాని, కాగితంగాని కప్పివేసి, వెలుతురు లోపలికి రాకుండా చెయ్యి. ఈవిధంగా గదిని కటికచీకటి చేసివేయాలి. ఇప్పుడు— కిటికీకి అమర్చిన నల్ల గుడ్డకుగాని, కాగితానికిగాని మధ్యలో చిన్నబెజ్జం చెయ్యి.



ఈ బెజ్జంగుండా గదిలోపలకు వెలుగు చొరుచుకు వస్తూవుంటుంది. ఈ వెలుతురు పైన పడేటట్టుగా నీవు తెచ్చిన నీటి సీసా పట్టుకో. కిటికీకి కట్టిన నల్లగుడ్డపైన ఇంద్రధనుస్సు ఏర్పడుతుంది.

* * *

ఒక కొవ్వొత్తి వెలిగించి బల్లపైన పెట్టు. ఇప్పుడు ఒక కార్డు తీసుకో. కొవ్వొత్తి మంట నీ నోటికి కొంచెం దూరంలో ఉండేటట్టు నిలబడి, మంటకూ నీ నోటికీ మధ్యగా ఆ కార్డును పట్టుకో. కార్డు మీద గట్టిగా వూదు. కార్డుకి అవతలనున్న మంట కార్డు వైపు—అంటే నీవైపుకి వస్తుంది.

* * *

రెండు గుండుసూదులూ, ఒక చిల్లికానీ తీసుకో. చిల్లికానీ బల్లమీద పెట్టు. రెండు గుండుసూదులూ రెండు చేతులతోనూ పట్టుకో. వీటి మొనలతో చిల్లికానీని బల్ల



మీదినించి లేవనెత్తి బొమ్మలో చూపించిన విధంగా పట్టుకో. ఇప్పుడు చిల్లికానీని గట్టిగా వూదినట్టయితే గిరగిరా గిరగిరా తిరుగుతుంది.

---

పజిలుకు జవాబు:



# అట్టమీది బొమ్మ

పౌండ్రకవాసుదేవుడనే రాజు కరూశదేశాన్ని ఏలుతూ ఉండేవాడు. అవతార పురుషుడైన శ్రీకృష్ణునికికూడా అనేక నామాలతోపాటు వాసుదేవుడనే పేరున్నది. ఈ సంగతి తెలిసి, పౌండ్రకుడు అసూయ చెందాడు. మూర్ఖతకొద్దీ కృష్ణునిపైన కార్పణ్యం వహించాడు.

ఉండబట్టలేక ఒకరోజున అతడు దూతలలో ఒకనిని చేరబిలిచి, "ఎవడో కృష్ణుడట! గొల్లపిల్లవాడట! వాసుదేవుడనే నా పేరు పెట్టుకుని తిరుగుతున్నాడట!! వాసుదేవుడనే బిరుదు నాకే తగును కాని, మరెవళ్లకు అర్హత ఉన్నది? కనుక, ఇప్పుడే నీవు ఆ కృష్ణునివద్దకు వెళ్లి నేను అన్నట్టుగా ఇలా చెప్పు: 'అబ్బాయీ! జాతిమర్యాదలు విడిచి, నీవు నాపేరు పెట్టుకు బతుకుతున్నావట, ఇది నీకు తగదు. తెలిసో తెలియకో చిన్నతనంచేత ఈ పని చేసిఉంటావు. ఇప్పుడైనా బుద్ధి తెచ్చుకొని, నీవు ధరించిన నా రాజచిహ్నాలు త్యజించు. ఆ శంఖచక్రాలూ అవ్వీ తీసివేసి నా శరణు చొచ్చితివంటే నేను నిన్ను క్షమిస్తాను' అని చెప్పిరా, పో" అంటూ వేగిరపెట్టాడు.

దూత సరాసరి వెళ్లి, నిండు సభలో ఉన్న శ్రీకృష్ణునికి ఈ వర్తమానం చెప్పాడు. అతడు చెప్పిన మాటలకు కృష్ణుడు పకపక నవ్వాడు. సభలోనివారందరూ ఆశ్చర్యపోయారు. అంతట శ్రీకృష్ణుడు దూతను అనేకవిధాల సత్కరించి, "ఓయీ!—నేను త్వరలోనే వస్తున్నానని మీ యజమానికి తెలియజెయ్యి. యుద్ధరంగమందు అతని శరీరము కుక్కలకు, నక్కలకు, గెద్దలకూ ఎర ఐనప్పుడు నేను ఈ 'వాసుదేవు'డనే బిరుదు విడుస్తానన్నానని చెప్పు" అన్నాడు.

ఈ మాటలకు దూత హడిలి పారిపోయి, పౌండ్రకునితో విన్నవించాడు. వెంటనే పౌరుషంతో పౌండ్రకుడు అచ్చగా కృష్ణునిలా కనుపించేట్టు వేషం వేసుకొన్నాడు. రెండు అక్షౌహిణుల సైన్యం సిద్ధం చేశాడు. మరి మూడు అక్షౌహిణుల సైన్యంతో అతని స్నేహితుడైన కాశిరాజు తోడు వచ్చాడు. వాసుదేవుడికీ, పౌండ్రకవాసుదేవుడికీ మధ్య ఘోరయుద్ధం జరిగింది. హోరాహోరీగా పోరిన తరువాత, కృష్ణుని చేతిలో పౌండ్రకుడు హతుడయ్యాడు. వాని సహకారి ఐన కాశిరాజును బాణంతో కొట్టేసరికి, వాని పుచ్చె ఎగిరి, తిన్నగా వెళ్లి కాశీపట్టణంలోనే వాని స్వంత కోట ఎదట పడింది!!

Controlling Editor : SRI CHAKRAPANI
Printed and Published by B. NAGI REDDI at the B. N. K. Press Madras

